# నేటి న్యాయం

[నాటకము]





పిల్లా యీశ్వరుడు

# వేటి న్యాయం

[నాటకం]



రచన

బిల్లా ఈశ్వరుడు



ఉమా పబ్లిషర్సు,
విజయవాడ, 1

# సమర్పణ

విశ్వమానవ కల్యాణమే ధ్యేయంగా,

సర్వమానవ సమానత్వమే ఆశయంగా

కలిగి

పీడితప్రజల విముక్తి యుద్ధంలో

ఆత్మబలిదానంచేసిన అమరయోధుల

ఆత్మశాంతి కోసం

హృదయభారంతో ........

# మనవి

తెలుగు నాటకకళా సరస్వతికి నే నర్పించు తొలి నీరాజనం యీ నాటకం.

కలవాళ్ళ ఘాతుకాలు, లేనివాళ్ళ హాహాకారాలు — యిదే యీ నాటకానికి యితివృత్తం.

గత కొంతకాలంగా ప్రజానాట్యమండలితో నటకునిగా నాకున్న సంబంధమున్నూ, నా సన్నిహితమిత్రుల ప్రోత్సాహమున్నూ నన్ను నాటక రచనలోకి దింపినది. రచనానంతరం నాటకంయొక్క యోగ్యతను గుర్తించి కప్పలదొడ్డి ప్రజానాట్యమండలివారు అక్కడక్కడ ప్రదర్శించారు. పెద్దల మన్ననలుకూడా పొందగలిగారు.

నాయీ రచనకు ప్రోత్సాహమిచ్చిన మా నాట్యమండలి మిత్రులకు, ప్రదర్శనలు జయప్రదంచేయడానికి కృషిచేసిన పెదన జ్యోతీ టెక్స్టైల్సు వారికి, నా పుస్తకాన్ని ప్రచురించి ప్రజల్లోకి తీసుకొనిపోతున్న ఉమా పబ్లిషర్సువారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనము లర్పిస్తున్నాను.

కప్పలదొడ్డి
6–11–54

బళ్లా ఈశ్వరుడు.



## హెచ్చరిక

ఈ నాటకం లిఖితపూర్వకమైన నా అనుమతిలేనిదే ఎవ్వరూ ప్రదర్శించుటగాని, ప్రచురించుటగాని, మరి యితరవిధాల ఉపయోగించుటగాని చేయరాదు. అట్లుచేసినవారు నాచేయు చర్యలకు బాధ్యులుకాగలరు.

— రచయిత.

# ఇందులో

ప్రసాద్ – డాక్టరు : నారాయణబాబు మేనల్లుడు

మూర్తి – లక్షాధికారిబిడ్డ: వినోదప్రియుడు

శాస్త్రి – మూర్తికి వంతపాటగాడు

నారాయణబాబు – పెద్దషావుకారు, మ్యునిసిపల్ చైర్మన్.
(అధికారమదం, డబ్బుమదం బాగా మూర్తీభవించినవాడు)

ధర్మయ్య – సామాన్యకుటుంబీకుడు; ధర్మవర్తనుడు.

మధు – ధర్మయ్య కొడుకు

వేణు – ప్రసాద్‌కు ఆత్మమిత్రుడు

కోటాయ్ – నారాయణబాబు నౌకరు

ఎస్. ఐ. –

గౌరి – ధర్మయ్యకుమార్తె

లీల – నారాయణబాబుకుమార్తె

# నేటి న్యాయం.

## రంగము 1

[నారాయణ బాబుగారి మేడలోనిహాలు. కుర్చీలు డ్రాయరు, ధనిక యిండ్లలో వుండే ఫర్నీచరంతా వుంటుంది. అగరువత్తుల కూజా, ఒక ఫొట స్టాండు వుంటాయి. గోడలకు తైలవర్ణ చిత్రాలు, యూరోపియన్ నగ్నసౌ దర్యాన్ని విరజిమ్మే చిత్రాలు వుంటాయి. యివి కొంచెం పాతబడినట్టు అ పిస్తున్నాయి. వీటిమధ్య యీమధ్యనే పెట్టినట్టుగా కొత్తగా కనిపిస్త గాంధి, నెహ్రూల ఫొటోలుకూడా వుంటాయి. నారాయణ బాబుగా కుమార్తె లీల యీరోజున యెందువల్లో చాలా కులాసాగా వుంది. వేషభాషల నవనాగరికత ఉట్టిపడుతుంటుంది. వయస్సు 20 సం॥లు.]

సమయం : సాయంకాలం గం. 4½.

లీల :

పాట

ఓహో, ఓహో, కోయిలా
ఓహో, ఓహో, కోయిలా
ఎందులకో యీ అమితానందం
మంజుల రవమొ మధురాలాపమొ
ఎవరి కోసమో అది యేమొ
దెల్పుమా ఓహో ... ...
హేతువేమేమొ దెల్పుమ కోయిలా
విడిచిపోయినా విభు వసంతుకై
ఎన్నో దినములు యెదురు జూచియు
అతని రాక విని ఆనందముతో
కోమలగానము చేయుచుంటివా

[పాట పూర్తిగాకముందే లోపలినుంచి "అమ్మ బాబోయ్, అయ్యబాబోయ్, సచ్చానే నీమొకం ముండ" అనే కేకలువినిపిస్తాయి. అంతటితో లీల పాట ఆపుచేస్తుంది.)

లీల : (లోపలికి చూస్తూ) ఏమిటది? కోటాయ్ కోటాయ్ (పిలుస్తుంది.]

లోపల : అయ్యబాబోయ్, సచ్చానేవ్.

లీల : అడిగేదానికి సమాధానం లేకుండా యేమిటాగోల? యిలారా.

కోటా : (వేలుకు గుడ్డ చుట్టుకుంటూ బాధగా వణకుతూ వస్తాడు వయస్సు 55 సం||లు.)

లీల : అదేమిటి?

కోటా : నా గాశారం. పొద్దున్నే లేత్తూ ఏ తల్లి మొకం సూశానో యేమొ నెత్తురు కళ్ళ సూశాను.

లీల : నెత్తురే! ఎందుకని?

కోటా : ఏంటుంది. ఆ యెదవ సచ్చినముండ రామి లేదూ? అదిగో దానిమూలంగానే యింతయ్యింది.

లీల : ఏం చేసిందేం?

కోటా : నాబొంద చేసింది. సిన్నబాబుగా రొత్తున్నారు. సప్పున వంట కావాలి. నువ్వుకూడా కాత్త శెయ్యి శేసుకో మంది.

లీల : అంటే?

కోటా : సరేనని నేనుకూడా పెద్ద తెలిసిన యెదవలాగా కత్తి పీట దగ్గిర కూకుని గబగబా వుల్లిపాయిలు తరగడం మొదలెట్టాను.

లీల : ఊఁ, తరువాత.

కోటా : యిం కేముంది. ఒకటి రెండు మూడు అంతే, మూడో కోతతో నాయేలు ముక్కలు శక్కలై పోయింది.

లీల : యింతేగద. యీ మాత్రానికే అంత గోలచెయ్యాలా ?

కోటా : మీకు మాసెడ్డ సులాగ్గా వుండట్టుంది. యింతో డ్నయ్యాను. నేను బతికుండగా యెప్పుడూ నెత్తురు కళ్ళసూశి యెరగను. యియ్యాతే ఆ పాచినోటిదాని మూలంగా నా కర్మిట్టాకాలింది. (వేలు చూసు కుంటూ) యింతకూ నారాత యెట్టావుందో యేంటో.

లీల : పాపం. ఎదీ చూడనీ (చూసి కొంటెగా) బాగా తెగినట్టే వుందే నిజంగా.

కోటా : నిజంగా కాకపోతే అబద్ధంగా తెగిందేంటి. ముప్పాతిక మూడువీసాలన్నర తెగి నే నేడుత్తుంటే యింకా నిజంగా నేనాంట, నిజంగా!

లీల : (నవ్వుతూ) సరేగాని, యేం కట్టావ్ ?

కోటా : అదే. ఆరామిముండే కారం, యింకా యేదేదో తగ లేసికట్టింది. అబ్బ ఆమంటా యీమంటా కలిసి ముందు నాదుంప తెంచేత్తున్నాయ్.

లీల : అయితే కష్టమే. కొంచెం జాగ్రత్తగాకూడా వుండాలి. మొన్న యిలాగే ఒకరికి చెయ్యి తెగితే కొంచెం అశ్రద్ధ చేశాడు.

కోటా : చేత్తే !

లీల : యింకేముంది. చెయ్యి కుళ్ళిపోయింది. హాస్పిటల్లో ఆపరేషనుచేసి చెయ్యితీసేశారు.

కోటా : (కంగారుగా) ఏంటీ! శెయ్యే ! నాశెయ్యే ! యిక్కడికి (చేత్తో చూపిస్తూ) యిక్కడికి తీసేత్తారా ? అయితే నేనిక ఒంటిశేత్తోణ్ణే నన్నమాట. రెంశోశేతి రుణం తీరిపోయిందన్నమాట. (కంగారుగా అటూ యిటూ తిరుగుతాడు)

లీల : (పెద్దగా నవ్వుతూ) నీచెయ్యికాదు కోటాయ్ తీసేది. అయినా అంత భయపడతా వెందుకు? చిన్నబాబు గారొస్తున్నారుగా డాక్టరీప్యాసై. రాగానే చూపించు; నీతోనే ప్రారంభిస్తారు ప్రాక్టీసు.

కోటా : ఏం శెంటీ ! శిన్నబాబుగారు నాయేలికి మందేత్తారా ? యీమాట నిజమే!

లీల : నిజమే కోటాయ్!

కోటా : సత్తిపెమాణకంగా.

లీల : ఊ!

కోటా : సెయ్యి తీసెయ్యక్కరలేదన్న మాటేగా ?

లీల : అక్కర్లేదు.

కోటా : (ఆనందంగా) అయితే గండం గడిశామన్నమాటే. (లోపల కారుహారన్ వినబడుతుంది)

లీల : అదిగో కారుహారన్! ప్రసాదే అయ్యుంటాడు. చూడు, చూడు. (కోటాయ్ గబగబా బయటకు వెళ్తాడు, ప్రసాద్ బయటనుండి వస్తాడు. చేతులో హేటు వుంటుంది. వేషభాషల్లో నాగరికతా లక్షణాలుంటాయి. వయస్సు 25.)

ప్రసాద్: హలో లీలా, గుడ్ మార్నింగ్!

లీల : ఓ. డాక్టరుగారా. నమస్తే.

(కోటాయ్ సామాన్లు బెడ్డింగు బయటనుంచి తెచ్చి లోపల పడేసి వస్తాడు.)

ప్రసా : (కోటాయని చూస్తూ) ఏం కోటాయ్. బాగున్నావా?

కోటా : యేదో మీ దయవల్ల యిప్పటికిట్టావుండా. (వేలు చూపిస్తాడు)

ప్రసా : అదేమిటి?

లీల : ఏముంది. కొత్తడాక్టరుగారింటికి వచ్చేసరికి పేషెంట్స్ని వెదుక్కునే అవసరం లేకుండా పాతపన్యానే పేషంట్లై కూర్చున్నాడు. వేలు తెగిందట. కానివ్వండి.

ప్రసా : అరరె. అలాగా! ఏదీ. (చూచి) ఏదో కట్టినట్టున్నావే?

కోటా: యేదో నాటుమందేశాలెండి.

ప్రసా : అయితే వెంటనే తీసేసి ఆ బకెట్లో లోషన్ నీళ్ళతో కడిగించుకుని వెంటనే రా. ఏదీ, నాబ్యాగ్ ఏదీ? (అటూ ఇటూ చూస్తాడు.)

లీల : పాపం ప్రయాణపు బడలికవల్ల డాక్టరుగారి బుర్ర పట్టి కొడుతున్నట్టుంది. బకెట్లూ, లోషన్ నీళ్ళూ వుండడానికి యిందేం హాస్పిటల్ కాదు. యిదియిల్లు. రోగుల గాయాలు కడగడానికి, కట్లు కట్టడానికి యిక్కడ నర్సులెవ్వరూ లేరు. తెలుసుకోండి సార్. తెలుసుకోండి.

ప్రసా : ఓ. ఎక్స్క్యూజు మి...(తలగోక్కుంటూ) ఒక్కమాట . . మీరే. . కొంచెం...

లీల : క్లీన్ చెయ్యమంటారా?

ప్రిసా.: అహాఁహా...ఎంతమాట. కొంచెం సహాయం చెయ్య మని!

లీల : నయమే కొంపతీసి గాయం కడగమన్నారుకాదు.

కోటా: అందులో యిశిత్రమేముంది. యిప్పుడు శిన్నబాబుగారు డాగుదొరగారయ్యారు. యికముందు శిన్న బుల్లెమ్మ గారుకూడా అవుతారు తప్పేంటి.

లీల: (నవ్వుతూ) బాగానేవుంది పద లోపలికి.

[లీల కోటాయ్ లోపలకు వెళ్తారు]

(బయటనుండి వేణువస్తాడు. యించుమించు ప్రసాదు వయస్సే వుంటుంది. వేషభాషలుకూడా అంతే.)

వేణు: (వస్తూనే) హాలో, ప్రిసాద్. నో నో, డాక్టరుసాబ్! యెప్పుడూరాక?

ప్రిసా : ఎవరు? వేణూ. నువ్వేనా? (షేక్‌హాండుతీసుకుంటూ) ఏమిటాృ వుల్టాసీదాగా మాట్లాడుతున్నావ్. కూర్చో.

వేణు : (కూర్చుంటూ) ఆఁ, ఏంలేదురా. పాతఅలవాటుగా ప్రసాదంటూనే వచ్చింది.

ప్రసా : అందులో తప్పేముంది?

వేణు: తప్పులేదూ! అయితే మనకు బుర్ర 'నో' అన్నమాట.

ప్రసా : అంటే

వేణు : వేలకువేలు తగలేసి డిగ్రీ ఒకటి తగిలించుకొచ్చావ్ గదోయ్. డాక్టరుగిరీ,

ప్రసా : అదా?

వేణు: ఆఁ. మరేమనుకున్నావ్. యెలాగయినా వున్నపేరు కన్నాకొని తెచ్చుకున్నపేరుగొప్పకాదురా ఈరోజుల్లో.

[లీల డాక్టరుబ్యాగ్‌తో వస్తుంది. కోటాయ్‌కూడా వస్తాడు]

వేణు: (లీలనుచూసి) ఓ, లేడీడాక్టరుగారేమిటి? గుడ్ నైట్. గుడ్ నైట్ ... అయితే యిదెప్పట్నుంచి?

లీల : యిదిగో యిప్పుడే ప్రారంభం.

వేణు: అలాగా. అయితే ఒక్కమాట. మూడు సంవత్సరాల నుంచి మూల్గుతోంది మా నాయనమ్మ మంచంలో. యింట్లోవారంతా దానికి చాకిరీ చెయ్యలేక చస్తు న్నారు. దయచేసి వక్కసారి వచ్చి...

లీల: అక్కర్లేదు. యిక్కడ వుండే మందివ్వగలను.

వేణు: ఏమిటీ? రోగిని చూడకుండానే?

లీల : అవును.

వేణు : అయితే దాంతో సరాసరి స్వర్గానికి టికెట్టు తీసుకోదు గద!

లీల: అలా జరిగితే మీ పీడేవదిలిపోతుంది.

వేణు : ఆల్ రైట్. సరే, ఒకబోర్డు తగిలించండి యింటికి.

లీల ; ఏమని?

వేణు: బ్రతకలేనివా డెవడన్నావుండి యిక్కడికి వస్తే మంచి దివ్యౌషధం దొరుకుతుందని.

లీల: అయితే ఆసంగతి డాక్టరుగారితోనే చెప్పు.

[యిప్పటివరకు ప్రసాద్ కోటాయ్ వేలికి కట్టుకడుతుం టాడు. అది యిప్పటికి పూర్తవుతుంది]

ప్రసా : (చేతులు తుడుచుకుంటూ) అదేమిటి? చెప్పేది నీవు గాని నాకు కాదుగా.

లీల: అయితే నేను మాట్లాడేది కూడా మీతరఫునగాని నా

తరఫున కాదుగా.

ప్రసా: ఓహో. అలాగా (ముగ్గురూ నవ్వుతారు)

ప్రసా : వాళ్ళేరిరా?

వేణు: ఎవరు?

లీల : యింకెవరు. మూర్తి అండ్ శాస్త్రి.

వేణు: (ప్రక్కకుచూస్తూ వెటకారంగా పురాణస్థాయిలో) అల్లదే ఆ మిత్రద్వయం బహిరయంబున నిటే అరుగు దెంచుచున్నయది.

[హలో ప్రసాద్! అంటూ మూర్తి శాస్త్రి వస్తారు. మూర్తి వేషభాషల్లో మరికొంచెం డాబుగా వుంటాడు. శాస్త్రి మామూలుగానే వుంటాడు. వయస్సు పై వారితో సమానమే. షేక్‌హాండు తీసుకుంటూ ర్చుంటారు.]

లీల : యింత లేటు చేశారేం?

మూర్తి: ఆఁ ఏంలేదు. అలా క్లబ్బుకు వెళ్ళి—

శాస్త్రి: ఏదో పేపర్లుచూశి వచ్చేసరికి కొంచెం ఆలస్య మయింది.

ప్రసా : అదేమిట్రా కలిపి మాట్లాడుతున్నారు?

వేణు : అదికాదురా. వీళ్ళిమధ్య తిరుపతి కవుల్లా జంటకవులు కావాలని తంటాలుపడుతున్నార్లే.

లీల: అయితే ఏదో ఖండకావ్యం రాస్తారన్నమాట.

వేణు: తప్పకుండాను. ఏ ప్రణయకావ్యమో అది సాధ్యంగాక పోతే ఏ ప్రళయకావ్యమో రాసి మన నెత్తిన పారే స్తారు. యిక అది అర్థంకాక మనమంతా దద్దమ్మల్లా ఏడవాల్సిందే.

మూర్తి : అఘోరించావు లేవోయ్. ఎప్పుడూ ఒక్కటే పరిహాసం.
శాస్త్రి : ఎలాగైనా పెద్ద తెలివిగలవాడు లేరా. అందుకనీ——
వేణు : అంతకోప మెందుకురా, బ్రదర్? నే నేమన్నానని!
ప్రసా : ఏదో సరదాగా అన్నాడు లేరా. దానికింత సీరియస్‌గా తీసుకోవాలా?
మూర్తి : అయినదానికీ కానిదానికీ ఒకటే సరదా నేమిటి? సమయాసమయాలు గుర్తించనక్కర్లా?
శాస్త్రి : అయినా మేమన్న దేమిటి? వాడు చెప్పే దేమిటి?
వేణు : నేనేం చెప్పానోయ్. మీరు క్లబ్బుకు వెళ్ళింది పేపర్లు చదవడానిక్కాదు, పేకాట ఆడ్డానికని చెప్పానా?
మూర్తి : (తీవ్రంగా) షటప్.
శాస్త్రి : (అంతకంటె తీవ్రంగా) నాన్సెన్సు.
వేణు : (వెక్కిరింతగా) నాన్సెన్సు. మనకు నో సెన్సు.
లీల : (విసుగ్గా) అబ్బబ్బ! ఏమిటోయ్! యీ న్యూసెన్సు?
ప్రసా : (నవ్వుతూ) ఎందుకురా మూర్తీ! అంతకోపం. వేణు సంగతి మనకు తెలియదేం. వాడు పట్టి 'ఛాటర్ బాక్సు' కాదూ?

[కోటాయ్ కాఫీలతో వస్తాడు]

కోటా : అబ్బాయిలంతా అలిసిపోయారనుకుంటా, కాట్లాడుకుని. కాత్త కాఫి నోట్లో పోసుకోండి. నెమ్మదిత్తుంది.
లీల : బాగా చెప్పావ్ కోటాయ్. ఆపండోయ్ యిప్పటికి. అది కాస్తా లోపలికి పోయింతర్వాత నోటికేగాకుండా అవసరమొస్తే చేతికు్కూడా పని చెబుదురుగాని. యివ్వు కోటాయ్.

ప్రిసా : యజమానురాలిగారి ఆజ్ఞ శిరసావహించు కోటాయ్.

కోటా : (కోటాయ్ వరుసగా అందరికీ కాఫీయిస్తాడు. చివరకు ప్రసాద్ కు యిస్తూ) శిన్నబాబుగారికి నా శేతుల్తో కాఫీ యిచ్చి శానారోజులయ్యింది. కాని దేశం యెల్లారు. నా అనేటోళ్ళు లేరు. పైగా ఓటేలు కూడు. ఏంసయి త్తుంది. పాపం అందుశేతే మనిసి పాడై పోయారు.

లీల : అవును కోటాయ్! నువ్వు చెప్పింది నిజమే. చూడుపాపం చినబాబుగా రెలా దుక్కలా చిక్కి పోయారో! (నవ్వుతుంది)

కోటా : అదేంటి, దుక్కలా శిక్కిపోటమేంటి?

లీల : ఓ, పొరపాటు, పొరపాటు. సన్నగా పుల్లలా అనబోయి దుక్కలా అన్నాన్లే.

కోటా : సిన్నిబాబుగా రంటే బుల్లెమ్మగారి కెప్పుడూ అంతేలే. ఎరగం దేముంది. ఆయన నోరుమెత్తనోడు గనక యెట్టాగన్నా పరవాలా.

ప్రిసా : దానికేంలే కోటాయ్. ఏదో పరిహాసంగా అన్నదిలే.

కోటా : అంతేలే బాబూ, నాకుమాత్రం తెలవదూ, బుల్లెమ్మ గారి మనసంతా—

లీల : చాల్లే. అక్కడికికట్టిపెట్టి ఆగ్లాసులు తీసుకొని అవతలకు నడువ్.

కోటా : (భయపడుతున్నట్టుగా) సిత్తం తల్లీ! (గబగబా వెళ్ళ బోయి పడతాడు. అంతా నవ్వుతారు. గ్లాసులతో కోటాయ్ వెళ్ళాడు.)

[లోపల రేడియోలో పాటవినబడుతుంటుంది. అంతా సిగరెట్లు వెలిగిస్తారు.]

పా ట : రేడియో

ఆనంద మయమేగా
యీా జగము
జగతిని స్వేచ్ఛా స్వాతంత్ర్యము లే
నిండియుండగా నిరాశ యేలా
లేదు నిరాశకు స్థానము భువిలో
సాధించితిమి స్వర్గ సౌఖ్యముల ॥ఆ॥

ప్రసా : విన్నారా పాట? దాన్నిబట్టిచూస్తే ప్రపంచమంతా ఆనందమే కదూ.

మూర్తి : అవును· ప్రపంచమంతా ఆనందమే. మానవుణ్ణి ఆనందపెట్టేవి అనేకం. ప్రకృతిఅంతా మానవుడి అధీనం.

శాస్త్రి : దాన్ని స్వాధీనం చేసుకొని మానవుడు తన జీవితాన్ని సుఖమయం చేసుకున్నాడు.

ప్రసా : నీమాటరా వేణూ?

వేణు : పాడుతున్నాడుగదోయ్-ప్రపంచమంతా ఆనందమే నని. పైగా మనవాళ్ళు తాళంకూడా వేస్తున్నారు.

ప్రసా : అది సరేనోయ్. నీమాట నే నడిగేది?

వేణు : నామాటకేంగాని ముందు లీల నడుగు.

లీల : భలే చెప్పావోయ్. అడిగింది నిన్నయితే నాతో సమాధానం చెప్పించా లనుకుంటున్నావా?

మూర్తి : అసలు వాడికి తెలిస్తేకదూ, ప్రపంచమంటే.

శాస్త్రి : ఎదటివాడ్ని వెక్కిరించడం మాత్రం తెలుసు.

వేణు : అదీ అసలు సంగతి. బాగా నిష్కర్షగా చూశావురా ప్రసాద్! మనవాళ్ళు బురఖాలు. మన స్త్రీలందరూ స్త్రీజులంతా మనవాళ్ళను జూచి తెల్ల మొగాలు వేయాల్సిందే.

ప్రసా : అది సరేగాని నీమాట చెప్పవోయ్.

మూర్తి : పూర్వకాలంలో అంటే అనాగరికయుగంలో ఆనందానికి, మానవుని సుఖానికి తావులేదంటే అర్థముంది.

శాస్త్రి : కాని యీనాడు — ఆధునికయుగం అని చెప్పబడుతున్న యీరోజుల్లో — మానవుని సుఖానికీ ఆనందానికీ తావులేదంటే అర్థంలేదు. నేటి మానవుడు ఎంతో సౌఖ్యాన్ని ఆనందాన్ని అనుభవిస్తున్నాడు. నేటిప్రపంచంలో సుఖానికీ ఆనందానికీతప్ప దుఃఖానికితావేలేదు.

వేణు : ఆపరా బాబూ, ఆపు. నీ వుపన్యాసం వినలేక చస్తున్నాం. . . . ఆఁ . . . సరేగాని నువ్వన్న ఆనందం వుంది చూశావ్, పతిరాయుళ్ళ మఠంలో కెళితే బాగా దొరుకుతుందేమో? అక్కడ వట్టి ఆనందమే కాదు. బ్రహ్మానందం తాండవిస్తుంటుంది, ఆ ధమ్ము పొగలో.

మూర్తి . సంతోషించాంలేవోయ్.

వేణు : అదేకదూ ప్రపంచమంతా నిండివుంట.

శాస్త్రి : అసలు దుఃఖానికి తావెక్కడివోయ్ ప్రపంచంలో.

ప్రసా : (గంభీరంగా లేస్తూ) వుందిరా, దుఃఖానికీ విచారానికీ తావుంది.

వేణు : అయితే, ఆ రేడియో పాటకూ మనవాళ్ళ తాళానికీ కారణం?

ప్రసా : ఏమయినాకానీ. నాకళ్ళతో ప్రత్యక్షంగా చూసిన దాన్ని కాదనలేను.

లీల : ఏమిటది? నువ్వు చూసింది?

ప్రసా : నా చుట్టూ అంతా నిరుపేద జనమే. ఒక్కనాడు కాదు, ఒక్కక్షణంగూడా వాళ్ళ ముఖాల్లో ఆనందం కనిపించేదికాదు. కారణమేమిటా అని ఆలోచించాను. అసలు పరిస్థితిని తెలుసుకున్నాను. పూట తిండికే నోచుకోని ఆ దౌర్భాగ్యుల ముఖాల్లో ఆనందం యెలా కనిపిస్తుంది. వెన్నుకంటుకపోయిన పొట్టలు, పల్నాటి నూతుల్లా గుంటలుపడినకళ్ళు, సిమ్మెంటపెట్లు పెట్టిన రేకుల్లా లోపలికి తోసుకుపోయిన దవడలు, నిక్కిచూచే బొరలు, చింకి జుట్లు, వూస కాళ్ళు—

లీల : ప్రసాద్ – (ప్రసాద్ మాటలు చెబుతున్నంతసేపు చాలా చిరాగ్గా వుంటుంది. చివరికి భరించలేక బిగ్గరగా అరుస్తుంది.)

ప్రసా : ఏం లీలా భయమేస్తోందా? వున్నవిషయం చెప్పాను. అంతేగా.

లీల : చాల్లేవోయ్ చెప్పావు. అక్కడికి కట్టిపెట్టు.

వేణు : అవున్నా. ఎందుకూ పనికిరాని యిలాంటి కర్ణకఠోర నీచ ఛండాల క్షుద్రదరిద్ర జీవుల వెధవ ఆర్తనాదాలు మనలాంటి సంపన్న సుకుమార సుశరీర సుందరసున్నిత హృదయాలు వినడమా? హతవిధీ! పాపము శమించుగాక!

ప్రసా : అదేమిట్రోయ్ పురాణ కవిత్వం మొదలు పెట్టావ్.

వేణు: లేకపోతే యింతమంది యీ విధంగా ప్రపంచంలో విచారానికి తావులేదో అని గోలచేస్తుంటే, నువ్వొక్కడివి యేవేవో అర్థంలేని మాటలు చెబుతావ్? నీలాంటి వాడికి మేం క్షేంతవ్యమని చెప్పకోడానిక్కూడా షేమ్‌గానే వుంటుంది.

ప్రసా: తగ్గాలంటావ్?

వేణు: తగ్గకపోతే ఏదో పేరుబెట్టి సీవీపు రిపేరుచేసి యినప కటకటాల్లో పారేస్తారు. ఆ దెబ్బతో తిక్కంతా వదలి తిన్నగా వస్తావ్. అంతేకదురా, మూర్తీ!

ప్రసా: అయితే తగ్గానులే.

వేణు: యిప్పుడు మనవాళ్ళ మనస్సులు శాంతిస్తాయిలే.
[సిగరెట్లపొగ అందరూ ఒకేసారి వదలడంవల్ల లీల వుక్కిరి బిక్కిరవుతుంది.]

లీల: అబ్బ! వెధవపొగతో చంపేస్తున్నారోయ్. కొంచెం అటు వదలండి బాబూ!

వేణు: ఏమిటీ వెధవపొగా? ఎంత మాటన్నావు. నిజంగా సిగరెట్ మీద చెప్పాలంటే చాట భారతమవుతుంది. యిది వుంది చూశావ్ - అంటే యీ సిగరెట్ - యిది గోల్డుఫ్లేక్ కానీ, ఎలెఫెంట్ కానీ, డక్కను కానీ, ఆఖరికి చార్‌మినార్ కానీ ఒక్క దమ్ములాగి పీల్చాడంటే ఏది సరాసరి మెదడుకు షాక్ కొడుతుంది. అప్పుడు ఆ మెదడులో నుంచి ఆలోచనా పరంపర తామర తంపరగా ఒచ్చేస్తుందంటే అతిశయోక్తి యేమీలేదు.

లీ ల: భలేచెప్పావోయి. కాలేజీలో సిగరెట్ లెక్చరర్‌గా నిన్ను పెడితే చాలా బాగుండును.

మూర్తి: వరసబెట్టి అందరికీ సిగరెట్ కాల్చడం నేర్పేవాడు.

శాస్త్రి: అప్పుడు మనమంతా "ఏమండీ సిగరెట్ లెక్చరర్ గారూ" అని పిలవాలి కదూ.

వేణు: కాదు మరీ. నేను సిగరెట్ లెక్చరర్ని. మీరు పేకాట లెక్చరర్లు. పదండి. యిప్పుడే అప్లికేషన్సు అప్లయిచేద్దాం. [మూర్తి శాస్త్రిల ముఖాలు మాడతాయి. ప్రసాద్ గ్రహిస్తాడు. ఒక్కక్షణం నిశ్శబ్దం]

ప్రసా: యింతకూ యీ గొడవకేంగాని నాన్నగారేరి, లీలా?

లీ ల: భోజనంచేసి పన్నెండు గంటలకు వెళ్లారు. యిప్పటికీ రాలేదు.

ప్రసా: ఎక్కడికి?

లీల: ఆఫీసుకు. అటునుంచి కోర్టుకూడా వెళ్లాలన్నారు.

ప్రసా: ఎందుకు?

మూర్తి: ఏవో అనేక పనులుంటాయి.

శాస్త్రి: అందులో యీపట్టణానికి మ్యునిసిపల్ చైర్మన్ కాదూ. అందుచేత అనేకపను లుంటాయి.

ప్రసా: అయినా ఆయనకెందుకొచ్చిన ఆరాటమిది. సంపాదించ గలిగినంతవరకు సంపాదించాడు. యికనైనా విశ్రాంతి తీసుకోకూడదూ.

మూర్తి: మన కలాగేవుంటుంది. కాని వాళ్లూరికే కూర్చో లేరురా. అంతెందుకు? అంత సంపాదించాడా మా నాన్న, యిప్పటికి క్షణం కూర్చోడు.

శా్స్త్రి: అది వాళ్ళ కలవాటయ్యిందిరా.
వేణు: కాదురా మరి. వాళ్ళలా కూర్చుంటే యిలా పెంట పోగులా ఎలా పోగుపడుతుంది డబ్బు! క్లబ్బుల్లో నూ హోటళ్ళలోను మనం జల్సాలెలా వెలిగిస్తాం? మన జల్సాలిలా సాగాలంటే, వాళ్ళలా యెవళ్ళకొంపలో ఒకళ్ళ కొంపలు కూల్చి పోగుచేస్తుండాల్సిందే.
మూర్తి: ఆగవోయి ఆట్టేవాక్కు.
శాస్త్రి: మరీ వీడికి లోకువై పోయాంరా.
బయటనుండి : సార్. (కేక)
ప్రసా: ఎవరు ?
బయట : మూర్తిగా రున్నారా ?
మూర్తి : ఆ, వున్నాను.
బయట : మీకు టెలిగ్రాం వచ్చిందండి.
మూర్తి : టెలిగ్రామా ? (చరచరా వెళ్తాడు, శాస్త్రి కూడా. టెలిగ్రాంతో తిరిగొస్తారు. )
ప్రసా : ఏమిటారి అది ?
మూర్తి : మా మదర్ కు చాలా సీరియస్ గా వుందట.
లీల : అయ్యో పాపం!
ప్రసా : అయితే వెళ్తావా ?
మూర్తి : వెళ్ళాలి.
వేణు : ఆ కాలెటూళ్లో డాక్టరున్నాడురా ?
మూర్తి : లేడు.
శాస్త్రి : అయితే యిక్కడికి తీసుకొచ్చెయ్. మన డాక్టరున్నాడుగా.

మూర్తి : అలాగే వస్తాను. (శాస్త్రితో కలిసి వెళ్తాడు)
వేణు : (గడియారం చూస్తూ) ఓ సిక్సు ఓ క్లాక్! మనం కూడా వస్తాంరా.
ప్రసా : మళ్ళీ యెప్పుడు మీట్ కావడం?
వేణు : మార్నింగునే. గుడ్ బై. (వెళ్తాడు)

[ప్రసాద్ కుర్చీలో కూర్చుని పేపరు చూస్తుంటాడు. లీల యేదో సర్దుతుంటుంది. అంతలో కోటాయ్ వస్తాడు]

కోటా : భోజనానికి లేవండి బాబూ!
ప్రసా : ఆరుగంటల కప్పుడే యేం భోజనం కోటాయ్?
కోటా : పొద్దున అక్కడ యేం తిన్నారోయేమో. పొద్దు కేంలే బాబూ. అదే అవుద్ది, లేవండి.
ప్రసా : లేద్దాంలే. మామయ్యను రానీ.
లీల ; అదేమిటి కోటాయ్! అలా మొదలు పెట్టావ్? అసలు డాక్టర్లకు ఆకలవుతుందేం !
కోటా : ఏం ? ఎందుక్కాదూ ? ఆళ్ళు మాత్తరం మనుసులు కాదా!
లీల : కాదు, కోటాయ్! వాళ్ళకున్కూడా ఆకలంటూ వుంటే-యెదుటివాడు ఆకలో అని గోలచేస్తున్నా-కాదు, కూడదు, యీరోజు నువ్వన్నం తినకూడదని యెందు కంటారు ?
కోటా : రోగాన్నిబట్టి అంటారు.
ప్రసా : కాములే, కోటాయ్! మీ యజమానురాలుగారికి కొంచెం పైత్యం యెక్కువయిందిలే. అందుకే ఆ వాగుడు.

లీల : ఆఁ, అసలు సంగతి మరచాను. కోటాయ్! యిక వంట చేయించేటప్పుడు నన్ను కాదు అడిగేది. డాక్టరుగార్నే అడుగు. ఏది తింటే వేడిచేస్తుందో, ఏది తింటే జలుబు చేస్తుందో మనకేం తెలుస్తుంది? డాక్టరుగారికంటె అన్నీ తెలుస్తాయి. అందుకని యికనుంచి డాక్టరుగారినే అడుగు, ఏం జెయ్యాలో.

[బయట కారుహారన్ వినబడుతుంది]

కోటా : అదుగో పెదబాబుగారు కూడా వచ్చేశారు. (ఎదురు వెళ్తాడు. నారాయణబాబు వస్తాడు. ముఖంలో ఒక విధమయిన అహంభావం, నిర్లక్ష్యత కనిపిస్తుంటాయి. తల నలుపు తెలుపులతో మిశ్రమంగా వుంటుంది. హోదాకు తగ్గవేషం. వయస్సు 50 సం.లు )

ప్రసా : నమస్కారం, మామయ్యా!

నారా : (ఆలింగనం చేసుకుంటూ) మళ్ళీ యెన్నాళ్ళకు చూశానురా. ట్రైను దగ్గరకు నేనే రావాలనుకున్నాను. కాని, రాలేకపోయా. (కూర్చుంటూ) ఆఁ, కులాసాగా వచ్చినట్టే కదూ ?

ప్రసా : ఆఁ, కులాసాగానే వచ్చాను.

లీల : యిప్పటివరకెక్కడికెళ్ళావు నాన్నా?

నారా : చాలా అవుసరమయిన పనులున్నాయమ్మా, కోర్టులో. అవన్నీ చూసివచ్చేసరికీ వేళయ్యింది.

ప్రసా : యింకా మీకెందుకొచ్చిన శ్రమండి యిది. యివన్నీ వదిలిపెట్టి హాయిగా కాలక్షేపం చెయ్యకూడదూ?

కోటా : చిన్నబాబుగార్లు కూడా యింటికొచ్చారు. యేదో ఆ

యిద్దరికీ ఆ మూడుముళ్ళూ యేయించి సంసారమ్మంతా
ఆరి నెత్తినబెట్టి మీ రిక హాయిగా వుండండి, బాబూ!

నారా : అలాగే చేద్దాం కోటాయ్. వచ్చే మాఘంలో పెళ్ళి యేర్పాట్లు చేసేద్దాం.

[ధర్మయ్య వస్తాడు. పల్లెటూరు వేషం. తల పూర్తిగా తెల్లబడింది. ముఖంలో అమాయకత్వం గోచరిస్తుంటుంది. కాని ఆలోచించి చూస్తే ఆ ముఖంలో ఒక విధమైన స్థిరత్వం కనబడుతుంది. వయస్సు 50]

ధర్మ : నమస్కారం, బాబుగారూ!

నారా : ఎవరు ? ధర్మయ్యా! రావోయ్, రా కూర్చో. (కుర్చీ చూపుతాడు)

ధర్మ : ఫరవాలేదులెండి.

నారా : అదేమిటోయ్. కూర్చో, కూర్చో.

ధర్మ : (కూర్చుంటాడు)

కోటా : బోజనానికి లేవండి బాబూ!

నారా: లీలా! నువ్వూ ప్రసాదూ వెళ్ళండమ్మా. నేను వెనుక వస్తాను. (లీలా ప్రసాద్ కోటాయి వెళ్తారు)

నారా: ఏం, ధర్మయ్యా! ఎలావుంది, మనవ్యాపారం?

ధర్మ : మీ దయవల్ల యిప్పటివరకూ ఏదో పొట్టపోసు కుంటున్నాం.

నారా: మా దయ కేముందోయ్. అంతా ఆ భగవంతుడి దయే.

ధర్మ : అది నిజమేననుకోండి. మీలాంటి వారి దయకూడా వుండాలిగా.

నారా: దాని కేమోయ్! మీలాంటివారికి సహాయం చెయ్యక పోతే యింకెవరికోయ్ మేం చేసేది?

ధర్మ : ఎందుకు బాబూ కబురుచేశారు ?

నారా: ఆఁ, ఏమీలేదు. ఆ రామయ్యకూ నాకూ జరుగుతున్న కేసు నీకు తెలుసుగా.

ధర్మ : (ఆ కేసువిషయం యెత్తేసరికి ముఖం వివర్ణమవుతుంది) తెలుసు.

నారా : అతనినిక్కు చూడవోయ్. నాఅంతటివాడ్ని ధిక్కరిస్తాడూ? ధిక్కరించనీ, అనుభవిస్తాడు.

ధర్మ : అదంతా యిప్పుడెందుకు, బాబూ! అసలుసంగతేమిటో చెప్పండి.

నారా : నలుగురిలో కొంచెం పలుకుబడిగలవాడవనీ, నామాట కాదనవనీ నిన్ను నాతరఫున సాక్ష్యం వేసుకున్నాను.

ధర్మ : (యీమాట షాక్ కొట్టినట్టయింది. లేస్తూ) నేనా! సాక్ష్యమా?

నారా : అవును. నువ్వే.

ధర్మ : ఏమని?

నారా : అది మన వకీలు చెబుతాడు. ఎలాగయినాసరే, యీ దెబ్బతో వాడిదుంప తెంచెయ్యాలి.

ధర్మ : (కృంగిపోతాడు)

నారా : ఏం ధర్మయ్యా! అలావున్నావ్ ?

ధర్మ : (నెమ్మదిగా) బాబూ!

నారా : ఏం?

ధర్మ : విన్నవాళ్ళంతా మీరుచేసేది అన్యాయమంటున్నారు బాబూ!

నారా : అంటారు, అంటారు. బుద్ధిలేకపోతేసరి. నీమాటచెప్పు. నీకూ అంతేనా?

ధర్మ : నాకా?

నారా ; నీకే!

ధర్మ : (జడుస్తూనే) నిజంగా వాడేమంత అపచారం చేశాడు, చెప్పండి. ఒక్కమాట, అదీ అంతతప్పులో జమకట్టాల్సింది కాదు. అలాంటిదానికి యింతచేసి వాడ్ని యేడ్పించడం అంత మంచిదికాదేమో ననుకుంటాను, బాబూ!

నారా : ఊఁ . . సరే . . వాడిమాట నీకూ బాగా చెవికెక్కిందన్నమాట! అయితే నువ్వు సాక్ష్యం చెబుతావా? లేదా?

ధర్మ ; కోప్పడకండి, బాబుగారూ! న్యాయం ఆలోచించమంటున్నా.

నారా : న్యాయం! న్యాయశాస్త్రమంతా నీకే తెలుసులా వుంది. న్యాయమట, న్యాయం!

ధర్మ : తమరే యిలా ఆగ్రహపడితే___

నారా : అప్రస్తుత ప్రసంగం అనవసరం. నువ్వు చెబుతావా? లేదా?

ధర్మ ; (మాట్లాడడు)

నారా ; మాట్లాడవేమోయ్. చెబుతావా? లేదా? (దగ్గరకు వస్తాడు.)

ధర్మ : (నెమ్మదిగా, గంభీరంగా) చెప్పలేను.

నారా : ఆఁ! (రెండడుగులు వెనక్కి వేస్తూ) చెప్పలేవూ?

ధర్మ : చెప్పలేను బాబూ. మీరు వేరేవిధంగా భావించకండి. యిక సెలవు, బాబూ! (వెళ్తుంటాడు)

నారా : (ముఖానకత్తివాటుకు నెత్తురుచుక్క వుండదు. వున్న ట్టుండి బిగ్గరగా) ఆగు.

ధర్మ : ఏం బాబూ! (వస్తాడు.)

నారా : నీకూ మాకూ వున్న లావాదేవీలుకూడా తేల్చు కోవడం మంచిది.

ధర్మ : అలాగే బాబూ. యింకా కొద్దిగా మీకు బాకీ వుంటాను. అదీ తొందరలోనే సర్దుతాను.

నారా : కొద్దిగానా? కొట్టుమీదికని పట్టికెళ్ళిన నాలుగువేలూ నీ తాతగాడి సొమ్మా?

ధర్మ : (యీమాట నెత్తిన పిడుగుపడినట్టయింది) ఆఁ. నాల్గు వేలా? అదేమిటి బాబూ! ఆనాలుగువేలకు వడ్డీతోసహా యెప్పటి కప్పుడు లెక్కజూచి నాకు సాధ్యమయినంత వరకు మీకు తెచ్చియిస్తూనే వున్నానుగా, బాబూ! యింక వందో, అంతకుపైనో యివ్వాల్సి వుంటుంది.

నారా : ఎవడి కిస్తున్నావోయ్ తెచ్చి. నువ్వు యిస్తే నీ నోటు మీద వసూలు వుండదూ? పైగా యిచ్చానని బుకా యిస్తున్నావా? తే. నా నాల్గువేలూ నాక్కావాలి.

ధర్మ : (ఖిన్నుడై) బాబూ! నేను డబ్బుతెచ్చినప్పుడల్లా వేరే ఖాతాలో రాసుకుంటూ నాల్గువేలూ అయిన తరు వాత వసూలు వేసి నానోటు నాకిచ్చేస్తామని మీరు

చెప్పలేదూ! జ్ఞాపకం తెచ్చుకోండి, బాబూ!

నారా : ఏమిటీ? వేరే ఖాతాలో రాసుకున్నానూ. ఔరా భాగ్యుడా! ఎంతో పెద్దమనిషి వనుకున్నాను. నమ్మాను. అడిగినప్పుడల్లా కాదనకుండా సాయంచేశాను. యింత తిన్న యింటికి వాసాలు లెక్కబెట్టేవాడవని తెలియక సాయం జేశాను.

ధర్మ : మీరెన్నన్నా అనండి, బాబూ! నేను చెప్పేదిమాత్రం యదార్థం. యిందులో బుకాయింపు యేమీ లేదు. నా సంసారాన్ని నాశనం చెయ్యకండి, బాబూ!

నారా ; చాలించు నీ నక్కవినయాలు. నాబాకీ అంతా అణా పైసలతో సహా చెల్లించితీరాలి.

ధర్మ ; బాబూ —

నారా ; ఆఖరిమాట—పదిరోజులు గడువిస్తున్నా. యీలోపుగా చెల్లించు. లేదా తర్వాత నీ యిల్లూవాకిలీ అంతా వేలం వేయిస్తాను.

ధర్మ : ఆఁ! వేలం వేయిస్తారా? బాబూ! ఎందుకు మామీద మీ కింతపగ ? మాసంసారాన్ని బయటికీడ్చి నడివీధి పాలుచేస్తే మీకు ఒరిగేదేముంది? యిప్పటివరకూ పరువుగా బ్రతికాను. ఒకరిచేత మాటపడి యెరుగను. అలాంటివాడ్ని యింటింటికీ ముప్పెత్తుకుని ఎలా బ్రతక మంటారు? కనికరించండి. యిలాగే వుండనివ్వండి. నా సంపాదనంతా యెప్పటికప్పుడు మీకు సమర్పించు కుంటూ వుంటా. మీ రుణం తీరేవరకు నాశక్తి నంతా ఒడ్డి పనిచేస్తా. యీమాత్రం కనికరించండి, బాబూ!

నారా : వీల్లేదు. నువ్వు చచ్చేదాకా తీరకపోతే ఏం కావాలి? వీల్లేదు.

ధర్మ ; మీ కాళ్ళుపట్టుకుంటాను. నన్ను రక్షించండి, బాబూ (కాళ్ళు పట్టుకోబోతాడు)

నారా : (తోసేస్తూ) ఛీ! నన్నుముట్టుకోకు. నీలాంటి విశ్వాస ఘాతకుణ్ని తాకినా పాపమే.

ధర్మ . (చివాల్న లేస్తాడు) ఆఁ, విశ్వాసఘాతకుణ్నా నేను. కాదు, బాబూ! కాదు. నే నెవ్వర్ని నమ్మించి ద్రోహం చెయ్యలేదు. కటికి కసాయివానిలా పరుల గొంతు కోయలేదు. నాబోటిమానవుడి కొంపదీయడానికి నన్ను సాధనం చేసుకోవాలని మీరు చూశారు. అందుకు వ్యతిరేకించానని నాకూ అదేశిక్ష ప్రసాదిస్తున్నారు. కాని, బాబుగారూ! నాఆస్తి మీస్వాధీనం చేసుకుని, నాకుటుంబాన్ని నడిబజారులోకి లాగినాసరే - చివరికి నాప్రాణంతీసినాసరే - నాచేత తప్పుడుసాక్ష్యంమాత్రం చెప్పించలేరు. అది నాఅంతరాత్మకు సంబంధించినది. యిక సెలవు. [వెళ్తాడు, బాబు అలాగేచూస్తూ నిల బడతాడు]

తెరపడును



# నేటి న్యాయం.

రంగము 2

[అది ధర్మసత్రం "నారాయణ బాబుగారి ధర్మసత్రం" అని బోర్డు కట్టి వుంటుంది. వసారాకు ఒకభాగంలో ధర్మయ్య మంచంమీద పడుకొని వుంటాడు. ఆ వసారాకే వంటచేసుకోడానికి గాను గుడ్డ అడ్డం కట్టబడి వుంటుంది. బయట దండెంకర్ర వుంటుంది. దానిమీద కొన్ని గుడ్డలు వుంటాయి. సత్రం లోపల మనుష్యుల అలికిడి వినిపిస్తుంటుంది. ఎవరో స్త్రీ లోపల మూల్గుతూ 'అబ్బ, అమ్మ, డాక్టరురాలేదూ?' అని ఆయాసపడుతూంటుంది. "యిప్పుడే వస్తారమ్మగారూ! అబ్బాయిగారు కూడా వెళ్ళారుగా — తీసుకు రావడానికి' అని జవాబు. 'వస్తారు, నాప్రాణంపోయాక అంతా వస్తారు—పాతెయ్యడానికి. నువ్వుకూడా వెళ్ళిచావరా, వస్తున్నారేమో' అమ్మ, అబ్బ అంటూ మళ్ళీ ఆయాసం. ఒక కుర్రాడు లోపలినుంచి వచ్చి బయటికి పోతాడు. వాడి వాలకంచూస్తే వాళ్ళదగ్గర పనిచేసేవాడుగా వుంటాడు. యింతలో ధర్మయ్యకుమార్తె గుణ చేటలో బియ్యం వేసుకొని వంటమరుగుకోసం కట్టుకున్న గుడ్డ తప్పించుకొని బయటకు వస్తుంది. పల్లెటూరి వేషం. వయస్సు 20 సంIIలు.] సమయం ; పగలు 10 గంIIలు.

గుణ : (బియ్యం ఏరుతూ) పాట

పాడుమా పాడుమా
ఆంధ్ర వనితల ఖ్యాతి విఖ్యాతి ప్రఖ్యాతి
అవని యుండేవరకు ॥పాం॥
అనిలోన వెనుకాడి
అరుగు దెంచిన పతిలో

• ఆంధ్ర శౌర్యజ్యోతి
వెలిగించె నొక నాతి
పలనాటి వీరుడౌ బాలచంద్రుని వేగమె
రణరంగమునకు బంపె రమణి మాంచాలి ॥ఆం॥
ఎందుకో యీ త్యాగము
ఎవ్వరూ వీరంతా
తెలుగుగడ్డలో పుట్టి
యీ తెలివన్నె రతనాలు
తెలుగు విజయధ్వజమూ
దశదిశలను నిలిపారు
తెలియలేవా ఆంధ్రవనిత
తెలిసి పాడగ లేవ నీవు
పాడుమా పాడుమా!

(పాటపూర్తికాగానే లోపలికి వెళ్తుంది. బయటనుంచి ధర్మయ్యకుమారుడు మధువు వస్తాడు. ముఖంకొంచెం తీవ్రాన్ని సూచిస్తుంది. అభిమానం యెక్కువ. ఆవేశంకూడా అదే మోతాదులో వుంటుంది. వయస్సు 25 సం॥లు.)

మధు : గుణా, గుణా! (పిలుస్తాడు)

గుణ : (లోపలనుంచే) ఆఁ, వస్తున్నా.(వచ్చి) ఏమి టన్నయ్యా?

మధు : నాన్న యింకా లేవలేదుకదూ?

గుణ : లేదు.

మధు : ఇదిగో మందు. (ఒక సీసా యిస్తాడు.)

గుణ : యింతకూ వ్యాధి యేమిటన్నారు?

మధు : అంతులేని ఆలోచనల్తో మనస్సు పాడుచేసుకుంటే పాతనొప్పి మళ్ళీ బయటికొచ్చింది.

గుణ : పాపం. ఆయనమాత్రం ఏం చేస్తాడన్నయ్యా? మంచి వా రనుకుని బాబుగార్ని నమ్మాడు. యిలా చేస్తారని ఆయనమాత్రం అనుకున్నాడా? అందుకు ఫలితంగా నేగా అకస్మాత్తుగా యింతజబ్బు తెచ్చుకున్నాడు,

మధు : నేను మొదట్నించి చెబుతూనే వున్నా. అయినా విన్నాడా? యింతకూ నాన్నకు తనమాటే తనకుగాని యితరులమాట వినే అలవాటులేదు గుణా! [కొంచెం వుద్రేకంతో] ఇచ్చిననాల్గువేలూ గుటకాయస్వాహా చేసి యింకా తెమ్మంటున్నాడు, దుర్మార్గుడు.

ధర్మ : (యిప్పటికి మధు కేకలు విని లేస్తాడు) ఎందుకురా, మధూ! అలా కేక లేస్తావు.

గుణ : అన్నయ్యా కేకలకేం గాని యీపూట యెలా వుంది నాన్నా! (దగ్గరగా వస్తుంది)

ధర్మ : కొంచెం బాగానే వుందమ్మా, మరేమీ ఫరవాలేదు. నువ్వు భయపడకమ్మా. (చేతితో తల నిమురుతాడు.)

గుణ : గ్లాసులో మందుపోసి యిచ్చి) యిది త్రాగు నాన్నా

ధర్మ : (త్రాగుతాడు. మధు చేతులలోతలపెట్టుకొని ఒక్క ముక్కాలిపీటమీద కూర్చుంటాడు.)

ధర్మ : అదేమిట్రా? మధూ! అలా కూర్చున్నావ్ ?

మధు : ఏమీ లేదు.

ధర్మ : యింటిదగ్గరనుండి కబు రేమైనా తెలిసిందా?

మధు : లేదు.

గుణ : ఒకసారి యింటికి వెళ్లొస్తావా, అన్నయ్యా! తమ్ముళ్ళూ చెల్లెళ్లూ యెలా వున్నారో!

మధు : నే వెళితే యిక్కడెలా, గుణా!

ధర్మ : (ఒక్క నిట్టూర్పు విడుస్తూ) నాగురించి యెందర్ని బాధ పెడుతున్నానురా, శ్రీహరీ! యింతకూ మమ్మల్ని ఏం చెయ్యదల్చుకున్నాడో ఆ నారాయణమూర్తి.

మధు : ఏం చెయ్యదల్చుకున్నాడా? నట్టేట్లో ముంచదల్చుకున్నాడు. [చరాల్న లేస్తాడు]

ధర్మ : ఎందుకురా, అంత విసురు?

మధు : మీ కలాగే వుంటుంది. మాబాబుగారు మాబాబుగారని నెత్తినెక్కించుకొని యీకాడికి తెచ్చారు. నాకు మొదట్నించీ తెలుసు – వాడు తడిగుడ్డలతో గొంతులు కోసేరకమని.

ధర్మ : ఏదో ఆ కోపాన్న అన్నాడేగాని అంత అన్యాయానికి ఒడిగడతాడట్రా, ఆ బాబుమాత్రం !

మధు : ఓహోహో ! అపరధర్మావతారం కాదూ మరీ !అంత అన్యాయం చేస్తాడూ? లేదు, లేదు. కాకపోతే అమాంతంగా అమాయకుల కొంపలార్పేస్తాడు. కటికి దరిద్రుల రక్తాన్ని జలగలా పట్టి పీలుస్తాడు.

ధర్మ : మధూ ! ఎందుకురా అంతంత మాటలు ?

గుణ : ఆయ నంత అన్యాయానికి తలపెడితేమాత్రం న్యాయం నట్టేట్లో కలుస్తుందా? ఎప్పటికైనా న్యాయం జయించి తీరుతుంది.

మధు : (బిగ్గరగా నవ్వుతూ) న్యాయం... (మళ్ళా నవ్వుతూ) న్యాయం!

గుణ : ఎందుకన్నయ్యా అలా నవ్వుతావు?

మధు : (తిరిగి నవ్వుతూ) న్యాయం ... పూర్వం మూరెడు గడ్డాలు, బారెడు మీసాలవాళ్ళు వుండేవాళ్ళని చెబుతారే, వాళ్ళు రాసిన తాటాకు కవిలికట్టల్లో వుందేమో న్యాయం. యికపోతే యిప్పు డాగవర్న మెంటువాళ్ళ దస్త్రాల్లో వుందేమో. అదీ మనం చూడనిది... గుణా! ఒక్కమాట చెబుతాను. యిలారా. (గుణ దగ్గరగా వస్తుంది) న్యాయం. మనకు తెలిసింది నిత్యం జరుగుతోంది చెప్పనా?... ఆఁ సరే! నువ్వెప్పుడనా నారాయణబాబుగారి మేడ చూశావా?

గుణ : ఎందుకు?

మధు : అదంతా నీ కనవసరం. చూశావా? లేదా?

గుణ : ఒక్కసారి చూశా, నాన్న వెంట వెళ్ళి.

మధు : ఎలావుంది?

గుణ : చాలా బాగుంది.

మధు : అంటే ?

గుణ : పెద్దమేడ. మేడముందు పెద్దప్రహరీ, వెనుక పూలతోట. యింకా___

మధు : అవన్నీ సరేనే. ఆయింట్లో పేద్ద యినప్పెట్టెవుంది, అది చూశావ్? అది నువ్వెలా చూస్తావులే, ఆపెట్టెలో ఏముంటాయో తెలుసా? నోట్లు, దస్తావేజులు, వెండి, బంగారం. అంతెందుకు మనలాంటి పేదవాళ్ళ జాతకా

లన్నీ ఆప్పెట్టెలోనే వుంటాయి. యీాయనలాగే యింకా కొందరున్నారు. పిళ్ళకూడా కోట్లాది పేద వాళ్ళ బొమికల్ని రూపాయి బిళ్ళల్లా, చర్మాన్ని నోట్లలా తయారుచేసి యినప్పెట్టెలు నింపుకున్నారు. వాళ్ళు చెప్పిందే న్యాయం. ఎందువల్లో తెలుసా? డబ్బంతా వాళ్ల చేతుల్లో వుంది గనక, వాళ్ళు చెప్పిందే వేదం, వాళ్ళు చెప్పిందే న్యాయం, ధర్మం, చట్టం, శాస్త్రం, నీతి, గీతీ అంతా వాళ్లుచెప్పిందే.

ధర్మ : మధూ !

మధు : (ఉద్రేకంలో వినిపించుకోడు) ఈ డబ్బుగల పెద్ద వాళ్ళంతా న్యాయంగొంతు పిసికి భూస్థాపితం చేశారు, గుణా! ఆ న్యాయదేవత సమాధులనుండే వీరి మహోన్నత ప్రాసాదపు పునాదులు లేచాయి. డబ్బున్నవానికి వంగివంగి సలాములు కొడుతోంది, నేటి న్యాయం. డబ్బుగలవా డెంతటిపాపాని కొడిగట్టినా వాడిపక్షమే వహిస్తుంది, నేటి న్యాయం. డబ్బు గలవానిబూట్లను నాకుతోంది, నేటి న్యాయం—

ధర్మ : (బిగ్గరగా) మధూ !

మధు : (చరాల్న తండ్రివంక తిరుగుతాడు. ఒక్కక్షణం ఆగి, ఆవేదనగా) అవున్నాన్నా ! మీకు కోపంవస్తుందని నాకు తెలుసు. తప్పుడుసాక్ష్యం చెప్పనన్నా వనే సాకుతో సంసారాన్ని సమూలంగా నాశనం చెయ్యా తలపెట్టా డా క్రసాయివాడు. వున్న శాస్త్ర ఆధారంపాతే

మన సంసారం యేంకావాలి ? తమ్ముడిచదు వేం. కావాలి? చెల్లెళ్ళ పెళ్ళి ల్లెలా జరగాలి? డబ్బిచ్చినప్పు డల్లా నోటుమీద వసూలు వేయించుకొని వుంటే యింత యేడ్వాల్సిన అవసరం వుండేదికాదుగా! ఒకడు చేసిన పాపానికి అందరూ శిక్ష అనుభవించాల్సి వచ్చింది. (పీటమీద కూలబడుతాడు)

ధర్మ : (దుఃఖంతో కూడిన స్వరంతో) అవున్నాయనా; అవును! తప్పంతా నాదే !

గుణ : ఏమిటన్నయ్యా! ముందూ వెనుకా చూచుకోకుండా నోటికెంతవస్తే అంతా అనెయ్యడమేనా? అసలే నాన్న గారు కృంగిపోతుంటే, నువ్విలాగేనా ప్రవర్తించేది?

ధర్మ : అవునమ్మా! ముందుబాధ్యతంతా వాడిమీదవుంది. వాడన్నమాట నిజమే. తప్పంతా నాదే. అందుకే అనుభవిస్తున్నాను. (ముఖం మోకాళ్ళమీద పెట్టు కుంటాడు.)

మధు : (అనవసరంగా తండ్రిని వ్యాకులపెట్టానే అని బాధ పడుతూ మెల్లగా తండ్రి దగ్గరకువచ్చి మంచంమీద కూర్చుని) నాన్నా !

ధర్మ : (తలపైకెత్తి) మధూ! (కౌగలించుకుంటాడు.)

మధు : ఆకడుపుమంటలో ఏమేమిటోవాగేశాను. మళ్ళీ మనసు పాడుచేసుకోకు నాన్నా! నొప్పి వస్తుంది.

ధర్మ ; అవున్రా! నువ్వన్నట్టే చేసివుంటే మన కిన్నిబాధలు వచ్చేవి కావు.

మధు : అబ్బ! పోనీ నాన్నా! కాసేపు పడుకో. యింతలో చెల్లి వంటచేస్తుంది. (ధర్మయ్యను మంచంమీద పడుకో పెట్టి విసరుతుంటాడు. యింతలో బయటనుంచి ప్రసాద్, మూర్తి, శాస్త్రి రంగంమీదికి వస్తారు. వెనుక డాక్టరు, బ్యాగ్‌తో కోటాయ్ వస్తాడు. డాక్టరుచేతిలో స్టెత స్కోపు వుంటుంది.)

ప్రసా : ఎక్కడరా?

మూర్తి : ఇదేరా, యీలోపలేరా.

కోటా : ఇది మన పెదబాబుగారు కట్టిచ్చిన సత్రమే బాబూ!

శాస్త్రి : అదేరా బోర్డు కనిపించడంలా!

ప్రసా : సరే పదండి! (అంతా లోపలికి వెళ్తారు.)

మధు : (ముందుకు వస్తాడు.) చూశావా గుణా! అందరిదీ ఒక్కటే వాలకం.

గుణ : ఆచేతిలో యేదో వుందే, ఆయన డాక్ట రనుకుంటా?

మధు : డాక్టరే, డాక్టరు.

గుణ ; ఎవరి కన్నయ్యా, ఆయింటో జబ్బు?

మధు ; ఆవిడే "రోడ్డురోలరు"లా గుమ్మాలు చాలకుండా వుంటుందే ఆవిడకట!

గుణ : పాపం ఏమిటో జబ్బు?

మధు : తింటే ఆయాసం, తినకుంటే నీరసం అన్నట్టు ఏదోవకటి అంతలావు మనిషికి ఆపాటి రోగమైనా వుండకుండా వుంటుందా? సరి, దానికేంగాని, గుణా! అసలు యీ సత్రంలోనికి మొట్టమొదట వచ్చిం దెవరు? వాళ్ళా మనమా?

గుణ : మనమే!

మధు : అయితే మనం బయటవసారాలో చలిలో చావడం, వా ళ్ళింట్లో వెచ్చగా వుండడానికి కారణం?

గుణ : సత్రీవ వాళ్ళబంధువులదటగా?

మధు : అసల్లో బంధువులూకాదు, పాడూకాదు.యిటీవలే కలిసిందట డబ్బు బంధుత్వం. యింకేముంది? మనల్ని కుక్కల్ని కొట్టినట్టు బయటికొట్టారు. వాళ్ళు తిష్ట వేశారు. చూశావా, నేటి న్యాయం!

గుణ : అదిగో మళ్లీ మొదలుపెట్టావు. నాన్న లేస్తాడు.

మధు : సరే, యిప్పుడే వస్తాను. నాన్న లేస్తే మీరు భోజనం కానివ్వండి.

గుణ : నువ్వెక్కడికి?

మధు : పనుంది.

గుణ : ఏమి టాపని?

మధు : ఏదో వుంది.

గుణ : చెప్పకూడదా?

మధు : యిప్పుడు చెప్పను.

గుణ : చెప్పాలి.

మధు : గుణా ! ఏమి టా పెంకితనం ?

గుణ : నువ్వుమాత్రిం. ఏమి టా మంకుతనం ?

మధు : వీపు చెడుతుంది.

గుణ : ఏమస్తా.

మధు : అట్టే వాగకు. నాన్న లేస్తాడు. నే వెళ్తున్నా.

గుణ : నాన్నను లేపుతా. నా...

మధు : (చరాల్న వచ్చి గుణనోరు మూస్తూ) చెబుతాను. లేపకే.

గుణ : మరి చెప్పు.

మధు : నాన్నతో చెప్పవుగద!

గుణ : చెప్పను.

మధు : నిజంగా చెప్పవుగద?

గుణ : అబ్బ! చెప్పను, చెప్పను, చెప్పను. సరేనా?

మధు : అయితే విను. బాబుదగ్గరకు.

గుణ : (ఆందోళనతో ఒక్కడుగు వెనక్కివేస్తూ) ఆ! నువ్వా, బాబుదగ్గరకా!

మధు : అవును. నేనే. నారాయణబాబుదగ్గరకే వెళ్ళదల్చుకున్నా.

గుణ : వద్దు. నువ్వెళ్ళవద్దు. నాన్నకు తెలిస్తే మరీఆందోళన పడతాడు,

మధు : ఎందుకు గుణా! అలా భయపడతావు? అతడూ మనలాంటి మనిషేగా?

గుణ : అయినా నువ్వెందుకు అక్కడికి వెళ్ళడం? అవసరమైతే నాన్నే వెళతాడు.

మధు : ఏం? నేనుమాత్రం ఎందు కెళ్ళకూడదు?

గుణ : అబ్బ! వెళ్ళకూడదని కాదు. నీనోరు మంచిది కాదు.

మధు : నే నేం బూతులు మాట్లాడుతా ననుకున్నావా? పిచ్చి దానా! మనబాకీని గురించే సవ్యంగా చెబుతాను.

గుణ : ఏమో, ఆయనపేరెత్తితేనే నాకు భయం. ఏమయినా గానీ నువ్వుమాత్రం వెళ్ళొద్దు.

మధు : ఇందుకే నేను చెప్పనన్నాను. యీ ఆడవాళ్ళతో యిదే చావు. వాళ్ళకు తోచదు, చెబితే వినరు.

గుణ ; అయితే అక్క— దేమీ నోరుజారవుగద!

మధు : ఆసంగతి నాకు తెలియదా గుణా!

గుణ : త్వరగా రావాలి. మళ్లీ నాన్న లేస్తాడు.

మధు : ఓ, అయిదునిముషాల్లో వస్తా. (చరచరా వెళ్తాడు.)

గుణ : (మధువెళ్ళినవైపే చూస్తుంటుంది. వెనక బూట్లచప్పుడు వినపడ్డంతో వెనక్కి—తిరిగి అవతలకు వెళ్తుంది. ప్రసాద్, మూర్తి, శాస్త్రి, కోటాయ్ వస్తారు.)

మూర్తి : ఏంరా బ్రదర్! ఎలావుంది?

ప్రసా : ఏమయినాకానీ— ఆమె కొంచెం తేలిక ఆహారం తీసుకొని, శరీరశ్రమ చెయ్యాలిరా?

కోటా : అదుగదీ అసలుసంగతి. మాకాలంలో అయితే, నాక్కొత్త కాక తగిలిందంటే కూడెట్టేవోళ్ళు కాదు. యిప్పు డేముంది? రోగం రోగమే, తిండితిండే. కనపడ్డదల్లా వూరికే నూకెయ్యడమే. అందుకే జనం యీావరసన సత్తున్నారు.

శాస్త్రి : నువ్వాగవోయ్! వాడ్ని చెప్పనియ్.

ప్రసా : నేచెప్పినట్టు చెయ్యండిరా. మరేంఫర్వా లేదు. వస్తాను. రా, కోటాయ్!

మూర్తి : పద. మేమూ కారుదాకా వస్తాం. (అంతా బయటకు వెళ్తారు. రెండుక్షణాలు గడుస్తాయి. గుణ బిందెతో బయటికి వెళ్ళబోతుంది. బయటనుంచి మూర్తి, శాస్త్రి

ఎదురుపడడంతో గుణ చరాల్న వెనక్కి వెళ్ళిపో
తుంది. మూర్తి నవ్వుతుంటాడు.)

శాస్త్రి : బ్యూటిఫుల్ గరల్, బ్యూటిఫుల్ గరల్!

మూర్తి : కాలేజీగరల్సు, కాలేజీగర ల్సని గంతులెయ్యడమే గాని, దీని కాలిగోటికి సరిపోతారా?, కాలేజీగరల్సు?

శాస్త్రి : నో, నో. అవన్నీ వట్టిలక్కడోరుబొమ్మలు కాదురా. ఎవర్రా యీ—

మూర్తి : చూడరా, ఆమె వింటుం దేమో!

శాస్త్రి : యింకా వినడంకూడానా! కావ్యాల్లో మనకవులు వర్ణిస్తారే-అలా లేడిపిల్లలా పరిగెడితే, మనల్నిచూడ్డంతోనే.

మూర్తి : ఏదో పల్లెటూరి పిట్టలా వుంది.

శాస్త్రి : అయితే పట్టావన్నమాటే!

మూర్తి : అదే, ఎలా పట్టాలో తోచడంలేదు.

శాస్త్రి : ఆరి పిచ్చోడా! తోచడంలేదూ. అయితే నేను చెబుతారా. (అంటూ చెవిలో యేదో చెబుతూ చేత్తో సైగచేస్తూ లోపలికి లాక్కుపోతాడు.)

తెరపడుతుంది



# నేటి న్యాయం

రంగము 3.

[నారాయణబాబుగారిమేడ. అంతా మొదటి రంగం మాదిరే. లీల హుషారుగా పాడుతుంటుంది.]

పాట

జీవిత వసంతశోభ నవ
జీవిత వసంతశోభ
యీనాడేగా అహో....
యీనాడేగా
వికసించిన దోయ్
యీ నవకుసుమం
గనవోయీ
జాగుచేసినా రే పేమానో
ఆలసింపకోయీ
జాల మేలనోయీ!

లీల : కోటాయ్ !

కోటా : ఏంటమ్మా ? (వస్తాడు)

లీల : బాబుగా రింకా రాలేదుకదూ ?

కోటా : (సందేహిస్తూ) ఏ బాబుగా రమ్మా! అంటే శినబాబుగారా ? పెదబాబుగారా ?

లీల : చినబాబు గారంటావేంటి కోటాయ్! డాక్టరైతే, డాక్టరను,

కోటా: అంతంత పెద్దమాటలకు నాకు నోరుతిరగదు, తల్లీ! అయినా శిన్నప్పట్నుంచి పెంచాను. నేను శినబాబుగా రనే పిలుత్తాను.

లీల : సరే, నీయిష్టం! దానికేంగాని, ప్రసాద్ పద్ధతి యేం బాగుండలేదు, కోటాయ్!

కోటా : ఏం? పాపం, ఆయ నేం జేశారు?

లీల : అక్కడచదివాడు. ప్యాసయాడు. బాగానే వుంది. యిక్కడ కూడా యెప్పుడూ అదే కంపా. యింటిదగ్గ రుంటే చాలు, పుస్తకం తనూ తయారు. లేకుంటే పరీక్షుంటూ దాన్లోది దీన్లో, దీన్లోది దాన్లో కలుపుతూ కూర్చుంటాడు. ఎంత డాక్టరయితేమాత్రం -యింత న్యూసెన్సేమిటి? కాసేపు కులాసాగా మాట్లాడడు.

కోటా : (చిన్నగా నవ్వుతూ) అదా?— సిన్నబాబుగారిసంగతి నాకు బాగా తెలుసు. యేదన్నా పట్టుపట్టారంటే అంతు తేల్సుకుంటారు.

లీల : పట్టేమిటి కోటాయ్! భల్లూకపు పట్టయితే. అన్నంతింటున్నా, ఆఖరికి కాఫీతాగుతున్నా యిదే ఆలోచన.

కోటా : ఏవో యిప్పు డిట్టాగే వుంటదిలే, తల్లీ! అది కాస్తా అయిపోతే, అప్పు డింత పట్టుద లెట్టా సాగుద్దిలే!

లీల : ఏదీ కాస్తా, అయ్యేది?

కోటా : అదే తల్లీ, అదే! నాన్నగారు శెప్పలా వచ్చేమాగ మాసంలోనే నని.

లీల : (సిగ్గుతో) ఫో. కోటాయ్! నువ్వు మరీను—

నారా : (బయట బిగ్గరగా నవ్వుతూ) భలే, భలేగా చెప్పా

వోయ్, మూర్తీ! భేష్! (బాబు, మూర్తి, శాస్త్రి వస్తారు. కోటాయ్ వెళ్తాడు.)

మూర్తి : అవునండీ, అలా కాకుంటే వెధవరిక్షావాడు లెక్క చేస్తాడూ మనల్ని? (అంతా కూర్చుంటారు.)

శాస్త్రి : అంతెందుకు? మీరు మ్యునిసిపల్ చైర్మనే అనుకోండి. అయినా ఆ కరుకుదనమే లేకుంటే, యీ పట్టణంలో మీ పేరు యిలా నిలబడగలిగే దంటారా?

మూర్తి : ఎప్పటికీ నిలబడేది కాదు. అంతేకాదు, యెందుకూ పనికిరాని యీ దిక్కుమాలినప్రజ లున్నారే-వీళ్ళకు గాని కాస్త లోకువిచ్చామంటే మనతాళ్ళు తెంపేస్తారంటే నమ్మండి.

శాస్త్రి : అందుకే "దండం దశగుణం భవేత్" అన్నారు, పెద్దలు.

నారా : భేషుగ్గా చెప్పావోయ్ శాస్త్రీ! మొత్తంమీద పురోహితుడి కొడుకు వనిపించుకున్నావ్!

శాస్త్రి : దాని కేంగాని, మీరు అసెంబ్లీ యెలక్షనుకు యెందుకు పోటీ చెయ్యకూడదా అని నా ప్రశ్న.

మూర్తి : తప్పకుండాను. మీహోదాకు యీ వెధవ మ్యునిసిపల్ చైర్మన్ ఏమిటండీ? న్యూసెన్సు, ఏ మినిష్టరో కావాలిగాని.

నారా : అదేనోయ్, నేనూ ఆలోచిస్తున్నాను. నేను నిలిస్తే నెగ్గుతా నంటారా?

శాస్త్రి : మీరే నెగ్గకపోతే ప్రపంచమే తల్లక్రిందులుకావాలి.

మూ : ఏం? యిప్పుడు నిలిచేవాళ్ళంతా మీకన్నా మహో పైనుండి దిగొచ్చారా ?

నారా : కాదోయ్. యీ మునిసిపల్ ఛైర్మన్ పదవి నా కొచ్చినందుకే ఎంతోమంది యేడుస్తున్నారు. మాట్లాడితే అది చెయ్యలేదు, యిది చెయ్యలేదు అని నామీద పెద్ద ప్రచారం చేస్తున్నారు. యిక కొంతమంది కౌన్సిలర్సుకూడా లోలోపల వారికి తాళం వేస్తూనే వున్నారు.

మూర్తి : అదంతా యెవరోకిట్టనివాళ్ళు చేసేపని. ఈమాత్రానికే మీరు వెనకడుగు వేస్తే యెలా?

శాస్త్రి : అయినా ఒకడు పైకివస్తే చూసి సహించలేని రోజులుగదండీ యివి. వెనక యెవడికో తనకులేదని యేడిస్తే ఒక కన్ను, రెండోవాని కుందని యేడిస్తే రెండుకళ్లూ పోయాయట! అంతే పీరూను.

నారా : అంతే నంటారా ?

శాస్త్రి : తప్పకుండా అంతే. అసలు మీరు నిలిస్తే,మిమ్మల్ని పోటీచెయ్యగలిగే దెవరండీ !

మూర్తి : అప్పైన యేదన్నావస్తే మేం లేమూ ?

నారా : అయితే జయిస్తా మంటారు?

శాస్త్రి : ఢంకామీద దెబ్బకొట్టి మరీని.

లీల : మొత్తంమీద ఆకాశాని కెత్తేస్తున్నారే!

శాస్త్రి : ఆకాశాని కెత్తడం కాదు. మామాట అక్షరాలా నిజం. (ప్రక్కకుచూసి) మామాట కాదంటే, అదుగో మనవేణు వస్తున్నాడు, వాడ్నడగండి.

వేణు : (వస్తూనే) అదేమిట్రోయ్! ఏమిటి న న్నడిగేది ?

నారా : రావోయ్ వేణూ! రా. కూర్చో. (క్షణం ఆగి ఏదో జ్ఞప్తికి రాగా) మాట్లాడుతుండండి. (వెళ్తాడు)

వేణు : [కూర్చుంటూ] ఏదో పెద్దప్లానే వేస్తున్నట్టున్నారే ?

శాస్త్రి : అది కాదురా, మన నారాయణబాబుగారు అసెంబ్లీ యెలక్షనులో నిలబడబోతున్నారు.

వేణు : అయితే మంచిదేగా!

మూర్తి : నీ అభిప్రాయం యేమిటి ? గెలుస్తారంటావా ?

వేణు : నాఅభిప్రాయాని కేమిటోయ్ ? వున్నారుగా మీరు యోధులు. నిర్ణయించండి.

మూర్తి : యిదిగో, యిదేరా నీదగ్గరున్న తలబిరుసు. ఒక్క మాటకూడ సూటిగా సమాధానం చెప్పవు.

శాస్త్రి : అలాచెబితే వాడి అతితెలివి యెలా తెలుస్తుందిరా లోకానికి?

లీల : అదేమిటోయ్ వేణూ! నీ అభిప్రాయ మేమిటని వాళ్లడిగారు. చెప్పరాదూ ?

మూర్తి : ఏమిటీ నీభ్రమ, వాడలా చెబుతాడనా ?

వేణు: అవున్రా. వారిసంగతేమోగాని, మీ సంగతయితే గట్టిగా చెబుతాను. మీరుగనక ఎలక్షనులో పోటీ చేశారూఅంటే ఢంకా భజాయించి మరీ గెలుస్తారు. అంతేకాదు. నువ్వు తప్పకుండా మినిష్టరువి. మనశాస్త్రి నీకు పర్సనల్ శక్రటరీ. అందులో మీకేశాఖో తెలుసా? హోంశాఖ. యిక అప్పుడు చూడండి, మన పరిపాలన!

కూడదు లేదనేవాడి బుర్రల్లా వూడగొట్టి అవతల పారేస్తారు, ఆబాధ లేకుండా.

మూర్తి : ఏడ్చావు లేవోయ్!

వేణు : మన పరిపాలనలో ప్రజలు చేసేది అదే. ఒకవేళ యీ మతిలేని ప్రజలు మీాఓట్లు పెట్టెలుఖాళీచేసినా నేనేగనక గవర్నరునయితే మిమ్మల్ని తప్పకుండా నామినేటు చేసిపారేస్తాను.

లీల : (చప్పట్లు గొడుతూ) హియర్! హియర్! చాలాబాగుందోయ్, వేణూ! నువ్వు గవర్నరు. వీళ్ళు మంత్రులు; చాలాబాగుంది.

వేణు ; బాగుండడ మేమిటి? గాడిదల కొమ్ములొచ్చినట్టే.

లీల : అదేమిటి?

వేణు : అసలే గాడిద వెనకాళ్ళతో తంతుందా, యిక దానికి ముందు కొమ్ములుకూడా వస్తే –

లీల : (నవ్వుతూ) అదా ?

మూర్తి : (కోపంతో) అంతవరకూ వస్తే నీలాంటిబూర్జి టూకడు అడ్డుపెడితేమాత్రం ఆగుతుందా?

శాస్త్రి : మేమేగనక అధికారంలోకివస్తే నిన్ను తప్పకుండా డిస్మిస్ చేసిపారేస్తాం.

వేణు : ఈ రామరాజ్యంలో అది చాలా చేతగాని పని.

లీల : అదేమిటోయ్, శాస్త్రీ! మిమ్మల్ని వ్యతిరేకించినవారి నల్లా డిస్మిస్ చేసిపారేస్తా రేమిటి ?

వేణు : అదిగో మళ్ళీ ను వ్వొదురు చెబుతున్నావ్. నిన్ను కూడా డిస్మిస్ చేసిపారేస్తారు. జాగ్రత్త !

లీల : అమ్మబాబో ! నన్నే.

వేణు : ఏం? అలా భయపడతావేం ? అమాయకుల్నికూడా అయినకాడికి అమాంతంగా అయిపులేకుండా చేసే యీమహాపర్వదినాల్లో యిది చాలా తేలిక్కాదూ ?

లీల : అందర్నీ అలాచేస్తే యిక వీరిపాలనలో మిగిలే దెవరు?

వేణు : దయ్యాలూ, భూతాలూ.

నారా : (వస్తూ) ఏమి టది ?

వేణు : ఆ యేమీలేదు. కాబోయే మినిష్టర్లు చెయ్యబోయే పనుల్ని గురించి చర్చిస్తున్నారు.

నారా : ఎవ రా మినిష్టర్లు ?

వేణు : ఎవరా ? (మూర్తి, శాస్త్రిల వైపుచూచి వ్యంగంగా) శ్రీ శ్రీ శ్రీ : . . . —

మూర్తి : (మరీ కోపంతో) ఆగవోయ్ !

శాస్త్రి : తెగనీల్గు డెక్కువవుతూందిలే.

మూర్తి : లేస్తూ యిక షేం వస్తామండి !

నారా : అయితే, అడగమరచాను, మీఅమ్మగారి కెలావుం దోయ్ మూర్తీ !

మూర్తి : కొంచెం నయమేనండి.

నారా : పోనీలే. యేదో యిక్కడ కొచ్చినందుకు సుఖంగా వెళ్తే అంతేచాలు.

వేణు : మనవాడు వైద్యం చేస్తున్నాడుగా. తప్పకుండా నయమవుతుంది.

లీల ; రోజుకు రెండుసార్లు వెళ్లి మరీ చూస్తున్నాడు.

మూర్తి : యిక మాకు సెలవు.

వేణు : నేనుకూడా వస్తాను, ఆగండి రా. (లీలతో) అయితే ప్రసాద్ ఏడి లీలా?

లీల : యేమో ప్రొద్దుననగా వెళ్లాడు, ఎవరో పేషంటుని చూడ్డానికని. యింతవర కంతులేదు.

వేణు : వస్తే, నేను వచ్చానని చెప్పు (బాబుతో) సెలవండి. పదండిరా. (వేణు, మూర్తి, శాస్త్రి వెళతారు. లీల లోపలికి వెళ్తుంది. నారాయణబాబు పేపరుతీసి చూస్తుంటాడు. యింతలో మెల్లగా మధు వస్తాడు.)

మధు : (నమస్కరిస్తూ) నమస్కారం, నారాయణబాబుగారూ!

నారా : (తల పైకెత్తకుండానే) ఎవరది?

మధు ; నేనండి. ధర్మయ్య కొడుకుని! నన్ను మధుఅంటారు.

నారా : (నెమ్మదిగా పేపరుదించి తల పైకెత్తి) ఊఁ! ఎందు కొచ్చినట్టు?

మధు : మాబాకీని గురించి మాట్లాడ్డానికి వచ్చానండి!

నారా ; డబ్బు తెచ్చావా?

మధు : లేదండి,

నారా ; మ రెందు కొచ్చావ్?

మధు : న్యాయం ఆలోచించండి, నారాయణబాబుగారూ! మానాన్న సాక్ష్యం చెప్పలే నన్నాడంటే, అన్యాయానికి వెరచిగాని, మీమీద అనురాగం లేకకాదు.

నారా ; పాపం! అలాగేం? అప్పుడు మరి, అంత అన్యాయాని కొడిగట్టానయ్యే. మీ రైలా చెబుతారు! ఆఁ! సత్య హరిశ్చంద్రుడు మీవంశములోవాడేకదూ!

మధు ; అదికాదు, బాబుగారూ!

నారా : మ రేమిటండీ మధుగారూ !

మధు : అంతా తెలుసుండికూడా అన్యాయాని కెలా ఒడిగట్ట మంటారు చెప్పండి?

నారా : అందు కే అవసరం లేదన్నాను కదోయ్.

మధు : మరి, మాబాకీ?

నారా : మీ బాకీ!

మధు : అంతా అలాగేవుందని మీ రన్నారట కదూ !

నారా : నేనుకాదు అనేది, మీరు రాసిచ్చిన నోటు.

మధు ; మానాన్న మీకిచ్చిన సొమ్ము ?

నారా : ఎవడి కిచ్చాడోయ్ మీనాన్న ?

మధు : మమల్ని యెందుకు నాశనం చేస్తారు బాబుగారు ! ఎప్పటికి కష్టాను మానాన్న మీకు సొమ్మిచ్చినమాట యదార్థమని మీకు తెలియంది కాదు.

నారా : అయితే నే నబద్ధమాడుతున్నా నంటావా ?

మధు : అదికాదు, నేననేది, మామీద ఆగ్రహంతో యిలా అంటున్నారేమోనని.

నారా : అదంతా అనవసరం. నానోటుమీద రావల్సినసొమ్మే నే నడుగుతున్నా.

మధు : మే మిచ్చింది?

నారా : ఎవరికి?

మధు : మీకే!

నారా : యిస్తే నోటుమీద వసూ లుండదూ?

మధు : సొంతం తీరినతర్వాత వసూలువేసి నోటిచ్చేస్తామని మీరు చెప్పలేదూ?

నారా.: అలాఅంటే వూరుకునే ఘటాలేనా మీరు?

మధు : ఊరుకో కేంచేస్తాం? మాకూ మీకూ వున్న సంబంధం యీనాటిది కాదు.

నారా : అందుకే యింత రాద్ధాతం!

మధు : మేమేమీ రాద్ధాంతం చెయ్యడంలేదు.

నారా : నేనేనా చేసేది?

మధు : న్యాయంగా మీకు రావల్సినబాకీ తీసుకోమంటున్నాం,

నారా : అన్యాయంగా మీ ఆస్తి అపహరిస్తానని నే నంటున్నా నా ఏం?

మధు : అయితే, బాకీఅంతా యివ్వాల్సిందే నంటూరా?

నారా ; ఏమిటోయ్! యీప్లీడరు క్రాసింగు?

మధు : న్యాయం నశించినట్టేనా అని నే నడిగేది?

నారా : అది వెళ్ళి న్యాయశాఖామంత్రి నడుగు.

మధు : వాళ్ళూ మీలాంటి పెద్దలే. అక్కడమాత్రం యెలా తేలుతుంది న్యాయం!

నారా : నువ్వో పెద్దన్యాయశాస్త్రవేత్తవు! అనవసర ప్రసంగం కట్టిపెట్టు.

మధు : అవును. మీ కిది అనవసరమే కానీ, నాకు చాలా అవుసరం. అది నాజీవితసమస్య.

నారా : యిక నువ్వెళ్ళొచ్చు.

మధు : కాఠిన్యం గడ్డకట్టుకుపోయిం దంటూరు ?

నారా : కాదు, కారుణ్యం కట్టలు తెగి ప్రవహిస్తుం దంటాను.

మధు : యిందుకే వాడలా తెగించి అన్నాడు.

నారా : ఎవడు ? ఏమిటి అనేది?

మధు ; ఎవడిమీద మమ్మల్ని తప్పుడుసాక్ష్యం చెప్ప మన్నారో వాడే — మిమ్మల్నిగురించే— మీప్రవర్తన గురించే అన్నాడు.

నారా : నువ్వుకూడా వాడితో కలిసి అఘోరించు.

మధు : అఘోరిస్తూనే వున్నారు.

నారా : ఎవరు ?

మధు ; కోరి నెత్తి నెక్కించుకున్న వాళ్ళు!

నారా : నెత్తి నెక్కినవాళ్ళు ! (కోపంతో స్వరం హెచ్చు తుంది.)

మధు : మీరే! (అదే స్థాయిలో)

నారా : షటప్. రాస్కెల్. యు గెటవుట్. ముఖం అదరి పోతుంది.

మధు ; వెళతాను కాని, మాటలు మర్యాదగా రానివ్వండి. మునిసిపల్ చైర్మన్‌గా నువ్వు చేస్తున్న ఘోరాన్ని సహించలేకే సాహసించి మిమ్మ ల్నెదుర్కొన్నా డా రామయ్య! అందు కతన్ని సర్వవిధాలా నాశనం చెయ్యడానికి మమ్మల్ని వుపయోగించుకోవా లను కున్నావు. అందుకు వ్యతిరేకించామని తిరిగి ఆ అస్త్రా న్నే మామీద ప్రయోగిస్తున్నావు. కానివ్వండి. మాఆస్థి యెలాస్వాధీనంచేసుకుంటారో అదీ చూస్తాను.

నారా ; నేనూ చూస్తాను, ఎలా స్వాధీనం కాదో! యిప్పుడే యీక్షణమే సీయిల్లూ వాకిలీ అంతా జప్తుచేయిస్తాను.

మధు : ఆఁ! జప్తుచేయిస్తావా? యెలా జరుగుతుందోచూస్తాను. నాకంఠంలో ప్రాణంవుండగా నాఆస్థి నీస్వాధీనం కాని

వ్వను. నా రక్తాన్ని ధారపోసయినా సరే! యీ అన్యాయాన్ని ఎదిరిస్తాను. (చర్రున వెళ్తాడు.)

నారా : (పెద్దగా నవ్వుతూ) రక్తం ధారపోస్తాడు, చవట వెధవ. (బయటనుండి ప్రసాద్, లోపలనుండి లీల వస్తారు. బాబు లోపలికి వెళ్తాడు.)

ప్రసా : ఆ వెళ్ళే దెవరు? లీలా?

లీల : ఏదో పల్లెటూ రనుకుంటా !

ప్రసా : ఏమి టలా విసురుగా వెళ్తున్నాడు?

లీల : వాళ్ళ బాకీని గురించి నాన్నగారికీ వారికీ ఏదో పేచీ వచ్చినట్టుంది.

ప్రసా : ప్రతివారితోనూ పేచీతే నన్నమాట.

లీల : ఆఁ! వాళ్ళ గొడవ కేంగాని, యిప్పటివర కెక్కడికెళ్లావ్? మనిషివికూడా అలా వున్నా వేమిటి ?

ప్రసా ; నామన సేమీ బాగుండలేదు, లీలా !

లీల : కారణం ?

ప్రసా : మీ నాన్నగా రిలా ప్రవర్తిస్తా రనుకోలేదు.

లీల ; ఏం జేశారు ?

ప్రసా : ఆయన చైర్మన్‌గా వున్నందుకు ప్రజల కన్ని విధాలా కష్టాలుగానే కనిపిస్తున్నాయి.

లీల : ఏమిటా కష్టాలు ?

ప్రసా : అనేకం. పట్నంలో మహామహంతులకన్నా మీ నాయన పేరంటే హడలుగా వుంది. అంతేకాదు, మునపటంతే అంతులేని ద్వేషం రగులుతోంది అందరిలోనూ.

లీల : ఎవరో కొరగానివాళ్లు కొందరు బాధపడుతున్నారని మనం విచారించడం తెలివితక్కువపని.

ప్రసా : అవును. వాళ్ళంతా యెందుకూ పనికిరాని చవటలే, గర్భదరిద్రులే. కాని లీలా! వాళ్ళే మన కీ అధికారా న్నిచ్చింది. వాళ్లవల్లే మనం ఈ స్వర్గసౌఖ్యాలనుభవించేది. వాళ్లేలేకుంటే మనం అడుక్కోడానిక్కూడా పనికిరాం!

లీల : ప్రసాద్ !

ప్రసా : అవును, లీలా! అది యథార్థం. కత్తిలేని యథార్థం. వాళ్ళు మనల్ని నమ్మి మన కా అధికారా న్నిచ్చారు. కాని మన మేంచేస్తున్నాం? యేరుదాటి తెప్పతగలేసి నట్టు వాళ్ళపై అధికారాన్ని చలాయిస్తున్నాం – గర్భ దరిద్రులనేభావంతో కాలరాచిపారేస్తున్నాం – సర్వ విధాలా నాశనంచేస్తున్నాం. యెక్కడికి వెళ్ళినా ప్రజలు చెప్పుకొనేది యిదే. నే విన్నదికూడా యిదే. కాని యిలా యెల్లకాలం జరుగుతుం దనుకోవడం వట్టి భ్రమ. యెవరినైనా ఒక్కసారి మోసం చెయ్యగలం గాని, యెల్లకాలం సాధ్యంకాదు. యికముందు జరిగేది కూడా అదే. (చరచరా లోపలికి వెళ్తాడు. లీల అలానే చూస్తూవుంటుంది.)

తెరపడుతుంది.

# నేటి న్యాయం

రంగము 4.

[రెండవరంగంమాదిరే. గుణ పత్రికచూస్తూ పాడుతుంటుంది.]

పాట

పేదలోకముకొరకు
ప్రాణాలు బలిసేయు
ఆంధ్రయోధుల్లారా
ఓ అమరవీరుల్లారా!
రక్తాన్ని చిందించి రాజబాటేశారు
ఆంధ్రజాతికొరకు అసువు లర్పించారు
తెలుగుజాతి మరువలేదోయ్!
మీ కింక చేయెత్తి జైకొట్టునోయీ॥

[అంతకుముందే ధర్మయ్య వచ్చి మంచంవాల్చి కూర్చుంటాడు. పాట పూర్తికాగానే]

ధర్మ : పిచ్చితల్లీ! యెప్పుడూ యిలాంటి పిచ్చిపాటలే పాడుతుంటావ్!

గుణ : అదేమిటి నాన్నా! అలా అంటావ్! ఆంధ్రజాతికోసం ఆత్మార్పణచేసిన అమరవీరుల యథార్థగాథలు పిచ్చి పాటలా?

ధర్మ : కాక మరేమిటమ్మా? ఒళ్లు తెలియని ఆవేశంలో ప్రాణాలు పోగొట్టుకోవడమేగాని, సాధించిందేముంది.

గుణ : (పత్రికలో ఫొటో చూపిస్తూ) ఇటుచూడు నాన్నా!

అంత చిన్నవయసులోనే ఎంతత్యాగం చేశాడో!

ధర్మ : (చూస్తూ) పాపం. నవనవలాడే ముఖం! ప్రాణాలన్నీ బిడ్డమీదే పెట్టుకొని తమ సౌఖ్యాన్నికూడా చూసుకోకుండా కంటికి రెప్పలా కాపాడిన కన్నతల్లిదండ్రుల్ని గర్భశోకంలో ముంచిపోయాడు.

గుణ : అవున్నాన్నా! చేతులారా పెంచిన ముద్దుబిడ్డల్ని పోగొట్టుకున్న తల్లులెందరో వున్నారు. ఆ వీరమాతలకన్నీళ్లు వృథాఅవుతాయా? తమబిడ్డలు ప్రాణాలుబలిపెట్టింది ఆకలిమంటలు చల్లార్చడం కోసంగాని, అన్యాయాన్ని నిలబెట్టేందుకు కాదు. లోకంలో ధర్మం శాంతి నాశనంగాకుండా వుండటంకోసంగాని, తమస్వార్థంకోసం కాదు. నిజంగా వాళ్ళు వీరులు. వాళ్లను గన్నతల్లులు వీరమాతలు. యిలాంటివాళ్లత్యాగం వృథా అవుతుందా? కాదు, వృథాకాదు. ఫలిస్తుంది. వాళ్లకోరిక తప్పకుండా ఫలిస్తుంది. వాళ్ళుకలలుగన్న స్వర్గరాజ్యం తప్పకుండా వస్తుంది. (ఆవేశంతో చెబుతుంటుంది.)

ధర్మ : ఎందుకమ్మా అలా ఆయాసపడతావు?

గుణ : అదికాదు నాన్నా! యీవిషయాలు గుర్తుకువస్తే యెందుకో నాకంతులేని ఆవేశం వస్తుంది.

ధర్మ : అవును, మీరిద్దరూ అంతే. అనుభవం తక్కువ, ఆవేశం యెక్కువ. అందుకే నాకెప్పుడూ భయంగా వుంటుంది.

గుణ : భయ మెందుకు నాన్నా!

ధర్మ : ఏమోనమ్మా! నా కలాగేవుంటుంది. యిప్పుడు చూడు

వీడు వెళ్ళి రెండురోజు లయ్యిందా? యింతవరకూ రాలేదు.

గుణ : నిజమే. అయిదునిమిషాల్లో వస్తానన్నవాడు యిప్పటి వరకు రాకపోవడం అనుమానంగానే వుంది.

ధర్మ : వీ డసలే దుడుకుపిండం. అక్కడ ఏంచేశాడో ఏమో?

గుణ : ఎక్కడ ఏవిధంగా నడుచుకోవాలో ఆమాత్రం తెలియదూ, అన్నయ్యకు?

ధర్మ : ఏం తెలిసినా వాడు పట్టివ్వదేకి. యెదుటివాడు మాటంటే సహించలేడు.

గుణ : మనవూరు వెళ్ళాడేమో!

ధర్మ : మనతో చెప్పకుండా యెందుకు వెళ్తాడు? పోనీ, నేనే బాబుగారిదగ్గర కెళితే___

గుణ : (పక్కకుచూస్తూ) నూరేండ్లాయుస్సు. అదుగోఅన్నయ్య (మధు వస్తాడు. తలనిండా గాయాలు. రక్తంతో తడిసి వుంటాడు. మనిషి తూలిపోతుంటాడు.)

గుణ : (మధుని చూస్తూ) అదేమి టన్నయ్యా... ఆ నెత్తురేమిటి? (పరికించి చూస్తూ) ఆఁ... దెబ్బలు... అమ్మయ్యో... నెత్తురువరదలు!

ధర్మ : (ఆందోళనగా) దెబ్బలా? (లేస్తాడు.)

గుణ : (మధును మంచంమీద కూర్చోబెట్టి తలకుగుడ్డకట్టి నెత్తురంతా తుడుస్తుంది.)

ధర్మ : ఏం జరిగిందిరా?

గుణ : యిలా కొట్టుకోడానికి నీకెవరికి చేతులొచ్చినాయి. చెప్పన్నయ్యా! ఏమి టిదంతా?

మధు : (బాధగా) అమ్మా... మంచినీళ్ళు...

(గుణ గబగబా మంచినీళ్ళు తెచ్చియిస్తుంది. త్రాగి మధు కొంచెం కుదటపడతాడు.)

ధర్మ : సంగ తేమిట్రా? బాబుగారి దగ్గరకు వెళ్ళావా?

మధు : (మాట్లాడడు)

గుణ : జరిగిం దేమిటో చెప్పన్నయ్యా!

మధు : జరగవలసిందంతా జరిగింది.

ధర్మ : అంటే! దెబ్బ లెవరు కొట్టారు!

మధు : దెబ్బలుకాదు నాన్నా. మనఆరాధ్యదైవం ఆదరంతో బహూకరించిన ఆభరణాలు.

ధర్మ : (విసుగ్గా) యింతకూ ఏం జరిగిందిరా!

గుణ : వున్నసంగ తేదో బయటపెట్టన్నయ్యా!

మధు : యింకా బయటపెట్టే దేమిటి? యింక మనదంటూ [illegible] తేగా?

ధర్మ : దావా వేశాడా?

మధు : దావా వెయ్యడమే కాదు, మనయింటికి తాళమే వేశాడు.

ధర్మ : (ఆదుర్దాగా) తాళం వేశాడా!

మధు : (చరాల్న లేస్తాడు. వుద్రేకంలో బాధ మరుస్తాడు) అవును. న్యాయమూర్తిని వాడ్ని నమ్మారు. వ్యవహారం దగ్గర గుడ్డిగావుండడం కూడదన్నందుకు మామీద గుడ్లెర్రజేశారు. కాని యిప్పుడు జరిగిం దేమిటి? పసిపిల్లలనే జాలికూడా లేకుండా పాషాణ హృదయంతో బయటికి గెంటారు. అదేమని అడ్డం

వెళితే యిదే సందని యిలా కసితీర్చుకున్నారు?

ధర్మ : (క్రిందుమీా దవుతాడు) అంతపనీ జరిగిపోయిదీ! నాబిడ్డలు దిక్కు-లేసివాళ్ళలా నడీవీధిలోకి గెంట బడ్డారా? (కూలబడతాడు)

గుణ : ఆ కసాయివాళ్ళు చివరి కా పసికందులమీాదకూడా కసి బట్టారా? వా ళ్లేమయ్యారు? ఎక్క- డున్నారు? చెప్ప న్నయ్యా! వాళ్ళ నేంజేసి వచ్చావు? చెప్పన్నయ్యా! (దుఃఖంతో మధుచేతులు పట్టుకొని కుదుపుంతుంది.)

మధు : ఫరవాలేదులే, గుణా! పక్కి-ంటివాళ్ళకు వప్పజెప్పి వచ్చా.

గుణ : ఎలాంటివాళ్ళ కేగతి పట్టిందన్నయ్యా!

మధు : (పొంగివచ్చే దుఃఖాన్ని దిగమ్రింగి గుణను ఓదారు స్తూ, ఏడవకు, గుణా! ... మనలాంటి పేదవాళ్ళు అన్ని కష్టాలూ భరించాలి ..... అదిగో ....... అటు చూడు. కడుపునిండా తిండిలేక ... వంటినిండా గుడ్డ లేక ఆ బూడిదలో పొర్లాడే ఆ పసిబిడ్డల్ని చూడు... ప్రపంచంలో వాళ్ళ కాశ్రియమివ్వగలిగేవి ఆ మురికి కూపాలే. భూదేవికి నిజమైనబిడ్డలు వాళ్ళు ... కానీ ... ఒకరోజున వాళ్ళకూ్కడా యిళ్లూవాకిళ్లూ వున్నాయ్. వాళ్ళూ మనుషుల్లాగే బ్రతికారు ... కాని యీారో జున వాళ్లు మనుషుల్లా బ్రతకడంలేదు ... యీా నవ నాగరికసంఘం వాళ్ళను నడీవీధిలోకి గెంటింది .... యిలాంటిగర్భదరిద్రులు లక్షలు ... కోట్లు ...

వున్నారు. యిప్పుడు మనవంతు వచ్చింది. మనమూ వాళ్ళలోనే కలిశాం.

గుణ : (దుఃఖాన్ని ఆపలేక) అన్నయ్యా! (అంటూ మధు చేతులమీద వాలుతుంది)

మధు : గుణా! (అంటూ ఆమెతల నిమురుతాడు.)

ధర్మ : (క్రృంగిపోతుంటాడు.) చిన్నతనంనుంచి నారక్తాన్ని పిండి సంపాదించిన ఆ చారెడుకొంపా నాకు కాకుండా పోయిందా ?

గుణ : పెద్దవాళ్లు యింటిదగ్గర లేనప్పుడు యిల్లుస్వాధీనంచేసు కోవడం యే న్యాయశాస్త్రం ఒప్పుకుంటుం దన్నయ్యా?

మధు : న్యాయం ! యెవడిక్కావాలి న్యాయం? యీరోజుల్లో కావల్సిం దల్లా డబ్బు. అది చేతులోవుంటే యెంత పనైనా చెయ్యొచ్చు.

గుణ : యెంతకూ మనయిల్లు వాళ్లపర మైనట్టేనా ?

మధు : పదిరోజులగడువిచ్చారు బాకీతీర్చుకోడానికి. వడ్డీ అని ఖర్చులని అసలునాలుగు వేలయితే ఆరువేలదాకా చేశాడా దుర్మార్గుడు. పది రోజులలో యీబాకీ అంతా కట్టకపోతే తర్వాత మనయిల్లూ వాకిలీ అంతా వేలం వేయిస్తామన్నారు.

ధర్మ : ఆఁ! వేలం వేయిస్తారా? న్యాయాన్ని నడివీధిలోపెట్టి వేలంవేస్తారా? . . . నమ్మాను . . . మోసపోయాను. అశోకధర్మచక్రంకింద అన్యాయాలు జరగవని ఆశ పడ్డాను, నీతి కీ రామరాజ్యంలో స్థానం లేదని తెలుసుకోలేకపొయ్యాను.

మధు : వద్దని యెంత చెప్పినా వినకుండా యీ మెట్టవేదాంతాలు చెప్పే మానోళ్ళు నొక్కి యీ కాడికి తెచ్చారు.

ధర్మ : అవును . . ., నిజమే . . . యిన్నాళ్ళూ మీనోళ్ళు నొక్కాను. చేతులారా మీ కంఠాల కురితాళ్ళు తెచ్చాను. చివరికి మిమ్మల్ని దిక్కు లేని వాళ్ళుగా చేశాను. అవును. అన్నీ నేనే చేశాను. యిన్ని చేసి కూడా యింకా చావకుండా వున్నాను.

గుణ : నాన్నా! (దగ్గరగా వస్తుంది.)

ధర్మ : (గుణ తలనిమురుతూ) వూరుకో అమ్మా! తల్లి లేని పిల్లలు . . . అన్ని కష్టాలూ నాకే ఒప్పజెప్పి మీ అమ్మ స్వర్గాని కెళ్ళింది! మిమ్మల్ని సర్వనాశనం చెయ్యడానికి యింకా నేను బ్రతికే వున్నాను. చివరకు పెళ్ళి కూడా చెయ్యలేని అసమర్ధుణ్ణి, యింకా బ్రతికేవున్నాను.

మధు : (తబ్బిబ్బవుతాడు. ఏం తోచిందో వున్నట్టుండి చరాల్న బయటికి వెళ్తాడు.)

గుణ : అన్నయ్యా . . . అన్నయ్యా . . . (వెళ్ళబోతుంది)

ధర్మ : మధూ, మధూ! (ఆదుర్దాగా వెళ్ళబోయి ముక్కాలు పీట తగిలి ముందుకు పడతాడు. తలకు గాయం తగుల్తుంది. గుణ భయంతో తండ్రి దగ్గరకు వస్తుంది.

గుణ : నాన్నా, నాన్నా!

ధర్మ : అమ్మా (మూల్గుతాడు.)

గుణ : మంచంమీద పడుకో నాన్నా!

(గుణ ధర్మయ్యను మెల్లగా మంచంమీద పడుకోబెడుతుంది. ధర్మయ్యా మూల్గుతుంటాడు. యింతలో ప్రసాద్

మూర్తి వస్తారు. ప్రసాద్ గుణను చూస్తాడు. గుణ వాళ్ళను చూచి తప్పుకుంటుంది!)

ప్రసా : ఎవర్రా వీళ్ళు? యిక్కడ మకాం పెట్టారు?

మూర్తి : సైలెన్సు. వింటారు (ప్రసాద్‌ను కొంచెం అవతలకు తీసుకువెళ్ళి ఏమిరా కన్నటుపడింది?

ప్రసాద్ : అబ్బే! ఏం లేదురా? వచ్చినప్పుడల్లా చూస్తాను, యిక్కడే వుంటారుగా అందుక నడిగాను.

మూర్తి : అంతేగద! కొంపదీస్సి ఒకచూపు చూడవుగదా?

ప్రసా : ఛ, ఛ! ఏం మాటల్రురా అవి!

మూర్తి : ఏదో నువ్వడిగావని అంటున్నా లేరా.

ప్రసా : యింతకూ అసలు వాళ్లెవరు?

మూర్తి : కనిపించడంలా. ఒక స్త్రీ, ఒకపురుషుడు.

ప్రసా : అది సరే నోయ్! యిక్కడెందుకున్నారా అని.

మూర్తి : అనేకాలు యిండొచ్చు.

ప్రసా అవే యేమి టని?

మూర్తి : ఏమిటా? మనలాంటి యువకుల మనస్సు కంగాళీ చెయ్యడం. వీలైనంతమట్టుకు వడుకోవడం. యిలాంటివే అనేకం.

ప్రసా : నిజంగానా?

మూర్తి : ఆఁ, మరేమనుకున్నావ్? యిక్కడ మొక్కనిపెట్టిన దగ్గర్నుంచి చూస్తున్నా దాని వరస. యెన్ని విధాల పన్నాలో అన్నివిధాలా పన్నుతోంది. మనం శాస్త్ర పచ్చగా కనిపిస్తున్నాం కదూ! అందుకని పట్టుబట్టి యిక్కడే తిష్ట వేసింది.

ప్రసా : ఆముసలాడు తండ్రడనుకుంటావు?

మూర్తి : తండ్రే! అయితే వాడెలా సహిస్తున్నాడనా నీసందేహం? అది యీరోజుల్లో సాధారణమైందిగా! యిదీ ఒక బిజినెస్. అంతెందుకు? మనం వచ్చేసరికి జరిగేదేమిటి.

ప్రసా : తండ్రిని పడుకోబెడుతోంది.

మూర్తి : అవున్రా, బాబూ! అవును. అది నేనూ చూశాను. నువ్వెలాగో డాక్టరు వని పసిగట్టింది. ఆ వంకతో నిన్నాహ్వానించడానికి ఆలోచించి అలా పన్నింది.

ప్రసా : అంతే నంటావా?

మూర్తి : ఇంకా నీ కనుమానమే! యిదంతా నాటకంరా బాబూ, నాటకం. యిలాంటి బజారు రకాల ప్లాన్లు నీకేం తెలుసురా.

ప్రసా : అయితే కావచ్చు. పోనివ్వరా ఆగోడవ. మనం పోదాం పద.

మూర్తి : ఏదో నువ్వాడిగావని చెబుతున్నాగాని లేకుంటే మన కెందుకురా ఆవెధవ సంత? పద. (లోపలికి వెళ్లారు.)

[గుణ బయటికి వస్తుంది. ధర్మయ్య మూలుగుతూ బాధ పడుతుంటాడు. గుణ తండ్రికి మందు త్రాగించబోతుంది. కాని సాధ్యంకాదు. యేమీ తోచక చివరకు కళ్ళనీళ్ళు పెట్టుకుంటుంది. యింతలో ప్రసాద్ లోపలనుంచి వచ్చి బయటికి వెళ్ళిపోతుంటాడు.]

గుణ : (తండ్రి బాధచూసి సహించలేక తెగించి డాక్టరు యెదుటకు వస్తుంది.) డాక్టరుగారూ ! మీకు దణ్ణం పెడతాను. మానాన్న ...మానాన్న తీరని ఆపదలో వున్నాడు. వక్కసారి వచ్చిచూడండి.

ప్రసా : (నిరసనగా) వీల్లేదు: నా కవుసరమైన పనులున్నాయ్.

గుణ : మీ కాళ్ళు పట్టుకుంటాను. ఒక్కసారి చూడండి. (కాళ్ళుపట్టుకోబోతుంది.)

ప్రసా : (తప్పుకుంటూ) నీసంగతంతా నాకు తెలుసు. దగ్గరకు రాకు.

గుణ : రండి.చూడండి. మానాన్న, తీరని ఆపదలో వున్నాడు.

ప్రసా : చాలించు. నీలాంటి నీచులకు నాదగ్గర స్థానంలేదు.

గుణ : మాలాంటి నిరుపేదవాళ్ళకు స్థానంలేదూ? ధనవంతులకేగాని, దరిద్రులకు మీదగ్గర స్థానంలేదూ? ప్రాణం మీదకు వచ్చినా చివరికి వైద్యసహాయంకూడా నోచుకోమూ? డాక్టరుగారూ! మీకు దణ్ణంపెడతాను. ఒక్కసారివచ్చి నాతండ్రిని చూడండి.

ప్రసా : కట్టిపెట్టు నీకల్లబొల్లి కబుర్లు. మానాభిమానాలు లేకుండా యిలా నీచంగా బ్రతక్కపోతే నీతిగా బ్రతకకూడదూ. తండ్రిట ... జబ్బట ... చూడాలట! ఏమి నాటకం!

గుణ ; ఆఁ! నాటక మాడుతున్నానా? మానాభిమానాలు లేకుండా నీచంగా బ్రతుకుతున్నానా!

పరిసా : నువ్వే కాదు. నీతోపాటు అనేకమంది అమాయక యువకుల మర్యాదకూడా మంటగలుపుతున్నావ్. ఘడియకొక వేషంవేసి కనపడ్డవాణ్ణల్లా కన్నుగొట్టి కల్మషపూరితమైన జీవితాని కలవాటుపడి చండాలంగా బజారుస్త్రీలా, కులటలా.....'

గుణ : డాక్టర్! (బిగ్గరగా అరచి చేతులతో తలబాదుకొంటూ ప్రక్కకుతప్పుకుంటుంది. డాక్టర్ ఒక్కక్షణం ఫీలవుతాడు. కాని వెళ్ళబోతాడు. యింతలో ధర్మయ్య మూల్గుతూ 'అమ్మా!అన్నయ్య యింకా రాలేదుకదూ' అంటాడు. డాక్టరు గభాల్న ఆగి ఆలోచిస్తూ మంచం దగరకొస్తాడు. నిదానంగా ధర్మయ్యను చూచి గురుపడతాడు. వెంటనే ర్చని ధర్మయ్యను పరీక్షచేసి తలకు కట్టుకడతాడు. కాని తా నన్నమాటలకు ఆతని హృదయం బాధతో బరువెక్కుతుంది. అలాగే ఆలోచిస్తుంటాడు.)

(తెరలో) పాట

మోసము తెలియగ లేవా మూఢా
మోసము తెలియగ లేవా
ఆత్మబుద్ధి నీ కవసర మేరా.
పరులమాట విన పాడిగాదురా మో॥

మానవసమాజం కరుణాహృదయం
మరువబోకురా మూఢా
చేసినపాపం చెరగాలంటే

క్షమాపణొక్కటే మార్గం
క్షమాపణొక్కటే మార్గం.

ప్రసా : (గుణను చూసి తప్పుచేసినట్టు బాధపడుతూ దగ్గరకు వెళ్ళి, చెల్లీ! (మెల్లగా అంటాడు.)

గుణ : (ఆశ్చర్యంగా) చెల్లీ!

ప్రసా : అవునమ్మా! నువ్వు నాకు చెల్లివి! నిన్నర్థం చేసుకోకుండా యేమేమిటో వాగాను. నన్ను క్షమించు చెల్లీ!

గుణ : (ఆనందంతో కూడిన ఉద్రేకముతో) అన్నయ్యా! (కాళ్ళమీద పడబోతుంది.)

ప్రసా : (ఓదారుస్తూ) తప్పుకదూ, నన్ను క్షమించాల్సింది నువ్వు. నాకు తోబుట్టులేని కొరత నీమూలంగా [illegible] యిందమ్మా! అదిగో యింకా కళ్ళవెంట నీళ్ళు.

గుణ : కూర్చో అన్నయ్యా, నాన్న కెలా వుంది!

ప్రసా : ఏ రేంభయం లేదు. బాబాను నేను చాలాసార్లు చూశాను.

గుణ : ఎక్కడ?

ప్రసా : ఈ వూళ్ళో నారాయణబాబుగారి నెరుగున్నావా? వాళ్ళింటిదగ్గర.

గుణ : నారాయణబాబుగారింటిదగ్గరా!

ప్రసా : అవునమ్మా అలా భయపడతావేం?

గుణ : ఆ నారాయణబాబుగారి మూలంగానే మాసంసారం యిలా నాశనమైంది. అందువల్లే నాన్నగారికి క్కూడా యీజబ్బు.

ప్రసా : ఏమిటి ! నారాయణబాబుగారి మూలంగానా? ఏం చేశాడు ?

గుణ : లేనిపోని అప్పులు కట్టి యిల్లు స్వాధీనం చేసుకున్నాడు.

ప్రసా : ఏవిధంగా ?

గుణ : మాది పల్లెటూరు. దీనికి దగ్గర్లోనే వుంది. మానాన్న చిన్న వ్యాపారంచేస్తూ మాసంసారాన్ని పరువుగా లాక్కొస్తున్నాడు. నారాయణబాబుగా రంటే నాన్న కెంతో ప్రాణం. ఆయనకూడా మాకు అప్పుసప్పు లిస్తుండేవాడు. కాని యేదో కేసులో మానాన్న తప్పుడు సాక్ష్యంచెప్పనన్నాడని లేనిపోని అప్పులు కట్టి యిల్లు స్వాధీనం చేసుకున్నాడు.

ప్రసా : అసలు బాకీలేనిదే అదెలా సాధ్యమయింది ?

గుణ : మొదట్లో బాకీమాట నిజమే కాని అప్పుడప్పుడు నాన్నగారు అప్పుక్రింద సొమ్ము ముట్టజెప్పుతూనే వున్నారు. కాని ఆయన నోటుమీద వసూలు వేయలేదు. ఆయనపై వుండే నమ్మకంతో నాన్నకూడా నోరు మెదపలేదు.

ప్రసా : సరే, తనతరఫున తప్పుడుసాక్ష్యం చెప్పనన్నాడని యీ అవకాశంతో ఆ స్తికాజేశాడన్నమాట !

గుణ ; అంతే యీమనోవేదనతోనే నాన్న మంచం యెక్కాడు. మాఅన్నయ్యకూడా మనస్థిమితంలేకుండా తిరుగుతున్నాడు. యింటిదగ్గర యిద్దరు తమ్ముళ్ళూ ఒకచెల్లెలూ వున్నారు. వారెక్కడున్నారో ఏమయ్యారో తెలియదు. (కళ్లనీరు పెడుతుంది.)

ప్రసా : ఏడువకు చెల్లీ! మీకుకావల్సిన సహాయమంతా నేను చేస్తానుగా.

[మూర్తిలోపలినుంచివస్తూ డాక్టర్నిచూచి ఆశ్చర్యంగా]

మూర్తి : హలో, డాక్టర్! యిదేమిటి? యిక్కడున్నావ్?

ప్రసా : అవును. యిక్కడే వున్నాను.

మూర్తి : బిజినెస్ పెట్టావనుకుంటాను?

ప్రసా : అది సాధ్యంకాలేదనే అన్నికారుకూతలు కూయడం.

మూర్తి : సక్సెసయినట్టేనా?

ప్రసా ; ఆఁ! సక్సెసే అవుతుంది, చపేటాల్తో.

మూర్తి : నాన్సెన్సు! వట్టిమాట. వారికాకావాల్సింది మనీ.

ప్రసా ; (తీవ్రంగా) షటప్. యిడియట్! కామెర్లరోగికి ప్రపంచమంతా పచ్చగానే కనిపిస్తుందట!

మూర్తి : అంతవరకు వచ్చిందన్నమాట! సర్కే అయితే వస్తావా?

ప్రసా : అది నాయిష్టం.

మూర్తి : సరే! (బయటికి వెళ్తాడు.)

గుణ : ఏమి టన్నయ్యా అంటాడు.

ప్రసా : వీడిమాటలవల్లే నిన్నపార్థం చేసుకుని అనరానిమాట లన్నాను. చెల్లీ! వీ డింతదుర్మార్గు డని యిప్పుడు తెలుసుకున్నాను.

గుణ : ఎప్పుడూ యిటు వస్తూపోతూ వున్నపుడల్లా యిక్కడ నిలబడి వెకిలిచేష్టలు చేస్తా డన్నయ్యా! నాకు మహా చిరాకేస్తుంది.

ప్రసా : అదాసంగతి. అందుకే నన్నమాట ఆకడుపుమంట. సరే! యీసారిగాని అలా ప్రవర్తిస్తే మొహాన్ని వుమ్మేయ్యి, సిగ్గొస్తుంది. ఆఁ! నేను మళ్లీవస్తాను. బాబా లేస్తే యీమందివ్వు. (మందిస్తాడు.)

గుణ : మళ్లీవస్తావుకదూ తప్పకుండా?

ప్రసా : తప్పకుండా వస్తానమ్మా! మిమ్మల్ని మర్చిపోతానా? నువ్వు నాకు చెల్లివికదూ? చెల్లిని మర్చిపోతాడా అన్నయ్య. (వెళ్తాడు.)

గుణ : (ఆనందంగా పాడుతుంటుంది.)

పాట

ఆహో ముదమాయె
నేడే ఫలియించే నాహో ॥ఆ॥
నా జీవితమే ధన్యంబౌ
మా కష్టాలే దూరంబౌ

హాయి హోయి హోయీ

యిక మా సంసారంబె హోయి ||ఆ

కటికిచీకటిలో కన్నుగానక

కనలే మా కోక కాంతికిరణము

దారి జూపగా దరిజేరిందోయ్

నిర్మలప్రేమ నెరపిందోయ్ ||ఆ||

తెరపడుతుంది



# నేటి న్యాయం

## రంగము 5.

[మొదటి రంగంమాదిరే. నారాయణబాబు ఖాతాపుస్తకాలు చూస్తూ వుంటాడు. కొంతసేపయిన తర్వాత—]

నారా : కోటాయ్, కోటాయ్! (పిలుస్తాడు.)

కోటా : (లోపల) వత్తన్నా బాబూ! (వచ్చి) ఏం బాబూ?

నారా : ప్రసాదింకా రాలేదూకదూ?

కోటా : లేదు, బాబు! యింకా రాలేదు.

నారా : ఎందుకొస్తాడూ? పెత్తనా లెక్కువైనాయిగా!

కోటా : ఇంకా సిన్నతనంలే బాబూ! ఏసావాసగాళ్ళతోనో వుండుంటారు.

నారా : చిన్నతనం? మాటలుమాత్రం మహాజోరుగా వస్తున్నాయ్!

కోటా : ఏమన్నాడు, బాబూ!

నారా : ఏమయినా అంటాడు. ఎవడో పైసాకుపనికిరాని వెధవ యేదో కూస్తే — వీడు నన్నే విమర్శిస్తాడూ!

కోటా : ఎవరో సెప్పినమాట విని, అట్టాఅనుంటాడు లేబాబూ! కాగేపాలుకాదూ, యింకా మంచీశెడ్డా యివరం యేం తెలుసుద్ది?

నారా : తెలియనివాడు తెలియనట్టు పడుండాలిగాని, ముందూ వెనుకా చూడకుండా వాగడమేనా?

శాస్త్రి : ఎవడండీ అవాగేది? (అంటూ శాస్త్రీ మూర్తీవస్తారు.)
నారా : రండోయ్, రండి. కూర్చోండి.
మూర్తి : ఎవర్నో కేకలేస్తున్నట్టున్నారే?
నారా : ఇంకెవడున్నాడూ!
శాస్త్రి : ప్రసాదా?
మూర్తి : ఏంచేశాడు?
నారా : నే నేమో వూరంతా వుడికిస్తున్నానని ఎవడో కూశాడట! దానికి లీలదగ్గర కావల్సినంత హంగామా, వీడు-
మూర్తి : అలాగా. అయితే మనవాడు చెప్పుడుమాటలు చెవికెక్కించుకొంటున్నాడన్నమాట!
శాస్త్రి : అయినా ప్రిసాదును కొంచెం అదుపులో పెట్టాలండీ! లేకుంటే యింకా—
మూర్తి : పోనివ్వరా. మన కెందు కాగొడవ? వాళ్ళకుటుంబంలో మనం కలతలుపెట్టినవాళ్ళ మవుతాం.
శాస్త్రి : అదేమన్నమాట! స్నేహధర్మ ప్రకారం చెప్పి తీరాల్సిందే. లేకుంటే మిత్రద్రోహంచేసినవాళ్ళ మవుతాం.
నారా : ఏమిటోయ్ అది? యింకా యేదన్నా వుందేమిటి?
శాస్త్రి : కావల్సినంత కుంభకోణం వుంది.
నారా : ఏమి టది?
శాస్త్రి : నేను చెప్పడ మెందుకు? కళ్ళారా చూసిన మనవాడుండగా.
మూర్తి : అబ్బ! పోనివ్వరా. మళ్లీ వాళ్ళు కష్టపడతారు.
నారా : అదేమిటోయ్, మూర్తీ! వున్నవిషయం చెప్పక —
మూర్తి : కాస్తఓపికపట్టి నాలుగురోజులాగితే మీకే తెలు

స్త్రం దనుకోండి. అయినా నేను చెప్పి వాడిమీద మీ కాగ్రహం యెందుకు తెప్పించాలా అని.

నారా : అని తర్వాతమాట! ముం దా సంగ తేదో చెప్పు.

మూర్తి : గట్టిగా చెప్పాలంటారా ?

నారా : తప్పకుండా చెప్పాలి.

మూర్తి : అయితే నేను చెప్పినట్టు వాడికి తెలియనివ్వకండి. మళ్ళీ నామీద కోపంపెట్టుకుంటాడు.

కోటా : అసలుసంగ తట్టిపెట్టి అడ్డదారితొక్కుతున్నా రేం, బాబూ !

మూర్తి : సరే. మామీ దెందు కీభారం ? నాకు తెలిసిం దేదో చెప్పేస్తాను. ఆఁ! మీరీమధ్య దావాలో యిల్లో యేదో జప్తుచేశారు చూడండి. అతనిపే రేమిటి ?

నారా : ఎవరు? ఆపల్లెటూరివాడా? ధర్మయ్య.

మూర్తి : ఆఁ! ఆఁ! ఆ ధర్మయ్యకు జబ్బుగావుందని మన సత్రం లోనే మకాంపెట్టారుకదూ !

నారా : అలాగా, యెన్నా ళ్ళయింది?

మూర్తి : మా మదర్‌ని తీసుకొచ్చేసరికే వున్నారు.

నారా : సరే. తర్వాత?

మూర్తి : అతగాడి కో కూతు రుంది. దాంతోనే మనవాడు—

నారా : ఆఁ! యథార్థమా ?

మూర్తి : నా రెండుకళ్ళతో చూస్తే – (శాస్త్రినిచూచి కన్ను గొడుతూ) ఏరా.?

శాస్త్రి : ఘోరంతా కోర్టకూస్తుంటే –

కోటా : అబద్ధం, అంతా అబద్ధం! చిన్నబాబుగా రొక్కనాటికి శెయ్యరు, అట్టాంటి పని.

శాస్త్రి : ప్రసాదం టే బాగా నమ్మకం వనుకుంటానే, కోటాయ్‌కి.

కోటా : అవును. నాకు నమ్మకమే. నాకు మొదట్నుంచీ తెలుసు, సిన్నిబాబుగారి సంగతి. ఆయన మీకుమల్లే లేతబుద్ధిగలోడు కాదు.

నారా : అంతపెద్దవాడయ్యా డన్నమాట!

శాస్త్రి : జరిగింది సాంతం చెప్పకుండా మధ్యలో ఆ పేశా వేరా?

మూర్తి : దానికేం శేరా? అది నన్నేగా.

నారా : నిన్నుకూడా యేదన్నా అన్నా డేమిటి?

మూర్తి : మిత్రుడుగదా అని చెప్పబోతే యేదో అన్నాడు లెండి.

శాస్త్రి : ఏదో అనడ మేమిటాయి? నోటికొచ్చినట్లల్లా తిడితే –

మూర్తి : అబ్బ! వూరుకోరా. దానికేమొచ్చె. నిజానికింకోకడయితే చాలా ముదిరేదే ననుకో. ఎలాగయినా స్నేహితుడుగా.

నారా : చవటపెధవ. అంత బరితెగాడన్నమాట! పాముకు పాలుపోసినట్టయిం దన్నమాట, వీడ్ని పెంచడం. నా గౌరవమర్యాదలు మంటగలుపుతున్నాడు.

లీల : (వస్తూ) ఏమిటది నాన్నా?

కోటా : కోప్పడకండి బాబుగారూ! సిన్నబాబుగా రొక్కనాటికి అట్టా శెయ్యరు. నిజం నిలకడమీద తెలవక పోదు. కాస్త ఓపికపట్టండి.

నారా : కళ్ళారా కనిపిస్తుంటే యింకా తేలే దేమిటి?
యిలాంటి దౌర్భాగ్యుణ్ణి పెంచడం నాదే పొరపాటు.

లీల : ఏమిటి, కోటాయ్! యిదంతా?

కోటా : సిన్నబాబుగారిమీద కొండాలు యెన్ని శెప్పాలో.
అన్నీ శెప్పారీ బాబులు.

నారా : కోటాయ్! అనవసరంగా వాళ్ళ నెందు కంటావ్?

కోటా : నిజం బాబూ! యియన్నీ కొండాలే. అన్నీ అబద్ధాలే.

నారా : చాలించు. నీకు మహా తెలిసినట్టు.

మూర్తి : అవును. అబద్ధాలు చెప్పాల్సిన అవసరం మాకు
చాలా వుందికదూ, అందుకు చెప్పాంలే.

శాస్త్రి : విషయం వచ్చింది కాబట్టి, మాకు తెలిసిం దేదో
చెప్పాం.

నారా : అంతేలేవోయ్, మీ దేముంది?

మూర్తి : అయినా మన కెందుకొచ్చిన పాడుగొడవరా, అంటే
విన్నావు కాదు నువ్వు, యిక్కడికి చాలు. పద. వస్తా
మండి. (వెళ్తారు)

నారా : బుద్ధిమాలిన వెధవ, రానీ. (చరచరా లోపలికి
పోతాడు.)

లీల : ఏం జరిగింది, కోటాయ్!

కోటా : ఏంటుంది, తల్లీ! సినబాబుగారిమీద పెదబాబుగారి
మనుసు యిరిసేశా రీ బాబులు.

లీల : ఏం చేశారు?

కోటా : సినబాబుగా రెక్కడో ఏదో చేశారని, పెదబాబు
గారికి కొండాలు శెప్పారు.

లీల : ఏమి టూ చేసింది?

కోటూ : ఏం శెప్పను, తల్లీ!

లీల : నీకు తెలిసిం దేదో అదే చెప్పు.

కోటూ : అయితే మీకు సినబాబుగారంటే నమ్మకముందా? ముందామాట శెప్పండి.

లీల : అ వేం మాటలు, కోటాయ్! నాకు నమ్మకం లేకపోవడ మేమిటి?

కోటూ : కాదు, తల్లీ! పెదబాబుగారివరస సూత్తే నాకు శానా బయంగావుంది. మీరుకూడా సినబాబుగార్ని నమ్మక పోతే, యిక ఆయనగతి ఒట్టిదే.

(లోపల "లీలా" అని కేక)

లీల : అలా యెందుకు జరుగుతుంది? కోటాయ్! అసలుసంగ తేమిటో చెప్పు.

(లోపల బిగ్గరగా "లీలా" అని కేక)

కోటూ : (భయపడుతూ) పద, తల్లీ! పద. ఆనక శెబుతాను. నాన్నగారు పిలుత్తున్నారు. యింతకూ యియ్యాళ లేదో మిడిమాలం వచ్చేటట్లేవుంది. (లీల కోటాయ్ వెళ్తారు.) [రెండు నిముషాలు గడుస్తాయి. యింతలో మధు మెల్లగా అడుగులు వేసుకుంటూ వస్తాడు. డ్రాయరు లోనూ అక్కడా యేవో వెదుకుతుంటాడు. యింతలో డ్రాయరుమీద వస్తువేదో పడడంవల్ల పెద్దశబ్దం అవ్వు తుంది. మధు పారిపోబోతాడు. యింతలో లోపలి నుంచి "ఆగు" అనే కేక వినిపిస్తుంది. మధు ఒక్క క్షణం ఆగి మొలలో కైజారు తీస్తాడు. కాని మళ్ళీ

పారిపోబోతాడు. యింతలో లోపల్నుంచి "ధన్" మనే శబ్దం వస్తుంది. మధు ఆగిపోతాడు. నారాయణబాబు పెద్దపెద్ద అడుగులు వేసుకుంటూ పిస్టలు మధుకు గురి పెట్టి గంభీరంగా వస్తాడు].

నారా : (కత్తి లాక్కుంటూ) విడువ్ !

మధు : (కత్తి వదలి, నారాయణబాబు కత్తి బల్లమీద పెట్ట బోయేసమయంలో అదనుచూసి బలంకొద్దీ బాబుచేతి మీద కొడతాడు. పిస్టలు దూరంగా పడుతుంది. మధు ఒక్కదూకుతో పిస్టలు చేతిలోకి తీసుకుంటాడు. బాబు కంగారు పడ్తాడు. మధు పిస్టలు బాబుకు గురిపెట్టి ముందుకు వస్తూ, ఖబడ్దార్ ! అడుగుముందుకు వేశావా, ఆఖరవుతావు.

[బాబుమీదికి వెళుతుంటాడు. యింతలో మూర్తి, శాస్త్రి మెల్లగా వెనకనుంచి వచ్చి గభాల్న మధురెక్కలు పట్టుకుంటారు.]

నారా : (పిస్టలు లాక్కుంటూ ఒళ్ళు తెలియని ఆవేశంలో) ముందు వాడి రెక్కలు విరిచికట్టండి. (మూర్తి, శాస్త్రి మధురెక్కలు విరిచి కడ్తుంటారు. బాబు మధుముఖం మీద గుడ్లలాగి గుర్తుపడతాడు.)

నారా : నువ్వా, దుర్మార్గుడా!

మధు : (నిర్భయంగా) ఆఁ! అవును, నేనే !

నారా : చేసే దేమీ లేదని చివరికి నాయింట్లో దొంగతనానికి పాల్పడ్డావా, నీచుడా !

మధు : నిజమే. నీయింట్లో దొంగతనం చెయ్యడానికేవచ్చాను. కాని, నీడబ్బుకోసంమాత్రం కాదు.

నారా : మ రెందుకు?

మధు : నీదొంగతనం బయటపెట్టడానికి.

నారా : నాదొంగతనమా?

మధు : అవును – నువ్వుచేసే అమానుషకృత్యాల్ని లోకం ముందు పెట్టడానికే. ను వ్వెంత పయోముఖవిషకుంభానివో ప్రపంచానికి తెలియడంకోసమే-నీదొంగఖాతాలు బయటకు లాగి దొరతనంవారికళ్లు తెరిపించడంకోసమే నీయింట్లో దొంగతనం చేశా—

నారా : (ఒళ్ళు తెలియని ఆవేశంతో) ఆఁ! దొంగవెధవ. (మధుచెంపలు టపటపా వాయిస్తుంటాడు. యింతలో ప్రసాద్ వచ్చి బాబుచేయి పట్టుకుంటాడు.)

ప్రసా : ఆగండి. ఏమి టా ఒళ్లుతెలియని శివం.

నారా : యిందులో నీజోక్యం అనవసరం. అవతలకు నడువ్, ముందు.

మధు : (దెబ్బలమూలంగా ఒక్క క్షణం ఆగి) కొడుతున్నావా? కొడతావు. నన్ను జైలుకు పంపిస్తావ్. చివరకు వురి కంబాన్నికూడా యెక్కిస్తావు. నాకు తెలుసు. వాటికి నేనేం భయపట్టంలేదుకూడాను. కాని నన్ను దొంగ అన్నావు. కాదు, నేను కాదు దొంగను. నువ్వు – పేద వాళ్ళప్రాణాలంటే గడ్డిపోచగా చూసే నువ్వు – ఒక్క ప్రాణానికి వేలరూపాయలు సంపాదించే నువ్వు – ప్రభుత్వం కళ్లల్లో దుమ్ముగొట్టి ప్రత్యక్షంగా ప్రజల్ని

దోచుకొనే నువ్వు-అధికారమదంతో అంతులేనిఅత్యాచారాలు చేసే నువ్వు-నువ్వే దొంగవు! పట్టిదొంగవు కాదు, గజదొంగవు! ప్రపంచాన్నే బహిరంగంగా దోచే బందిపోటుదొంగవు నువ్వే !

మూర్తి : షటప్, రాస్కెల్! వూరుకున్నకొద్దీ నోటిదురు సెక్కువవుతోందే?

నారా : అరగంటలో అంతా వదిలించేస్తా. (చరచరా లోనికి వెళ్తాడు)

నారా : (లోపల) హలో! పోలీస్ స్టేషన్ ... !ఆఁ! యెవరు? యిన స్పెక్టరుగారా?... నేను నారాయణబాబును .... నమస్తే నమస్తే ... ఆఁ, ఒకదొంగ మాయింట్లో చోరీ చేయడానికి వచ్చాడు ... ఆఁ, ఆఁ, యిప్పుడే ! ... ఆఁ, యెవడో పల్లెటూరివెధవ .... మిత్రుల సహాయంతో బంధించాను ... మీరు వెంటనే ... రెండు లారీలసిబ్బందితో రావాలి ... అర్జంటు ... సెలవు.

మధు : రెండులారీలు కావాలీ ఒక్కడికోసం.

శాస్త్రి : కాస్తఆగవోయ్, జైలు కటకటాల్లో కుస్తీపడుదువు గాని.

మధు : నామాటకేంగాని, ముందు మీసంగ తాలోచించుకోండి! యెంగిలి మెతుకుల కాశించే మీలాంటివాళ్లకు శృంగభంగం తొందరలోనే జరుగుతుంది.

మూర్తి : ఏడ్చావులేరా, బ్లడీఫూల్!

మధు : మర్యాదగా మాట్లాడ్డం మంచిది.

శాస్త్రి : క్లాసులుపెట్టి పాఠాలునేర్పుతా ననుకుంటాను !
మధు : ఆఁ! పాఠాలుచెప్పడమే కాదు. బండకూతలు కూసే
మీ నాలుకల్ని కండలరిగేటట్టు చితిక్కూడా పట్టగలను.
మూర్తి : ఆఁ! యేమన్నావురా ? (మీాది కెళ్తాడు.)
ప్రసా : (ఆపుతూ) ఆగరా. ఆనక చూపుదువుగాని, నీప్రతాపం!
నారా : (వస్తూ) చర్మాన్ని ఒలిపిస్తాగాని వూరుకుంటానా, దొంగవెధవను.
మధు : ఆదొంగతనమే బయటబడుతుంది. నీఖాతాలు బయట పెట్టు.
నారా : ఎందుకు ?
మధు : ఎప్పుడు నీ కెంతసొమ్మిచ్చామో తెలియడంకోసం.
నారా : ఈముఖానికితోడు ఖాతాపుస్తకాలుకూడాను.
ప్రసా : మనం అధర్మాని కొడిగట్టనప్పు డెందుకు భయపడాలి ! బయటపెట్టగూడదూ?
నారా : (తీవ్రంగా) నీసలహా లనవసరం. నువ్వు కట్టిపెట్టు ముందు.
ప్రసా : ఇవ్వదగినవాణ్ని కాబట్టే యివ్వడం.
నారా : ఆసంగతి మాకు తెలుసు.
ప్రసా : తెలిస్తే సంతోషమే.
(లీల, కోటాయ్ వస్తారు. దృశ్యంచూసి అయోమయమౌతారు.)
లీల : ఏమిటి నాన్నా! యిదో?
కోటా : ఏం జరిగింది, బాబూ!

మూర్తి : కనిపించడంలా ఖాతాపుస్తకాలకు కన్నంవేశాడు ఘనుడు.

శాస్త్రి : మేం గుమ్మందిగేసరికి దిమ్మలా నిలబడివున్నాడు. అనుమానిస్తూనే అవతలకు వెళ్లామో లేదో—

మూర్తి : ఇదే సందని లోపలికి వుడాయించాడు.

శాస్త్రి : మేం గనక కాస్త ఆలస్యంగా వస్తే - కావల్సినంత ప్రమాదం జరిగిపోయేది.

(సబినస్పెక్టరు పోలీసులతో వస్తాడు.)

సబి : నమస్తే, చైర్మన్‌జీ!

నారా : నమస్తే, వచ్చారా ?

సబి : ఫోనులో మీమాట వినగానే ఎక్కడిదక్కడ వదిలేసి వచ్చాం. ఎవడండి మీయింట్లో చోరీకి వచ్చిన స్కాండ్రల్! ఏయ్ ఒన్‌ఫార్టీఫోర్! మీరందరూ అన్నిగుమ్మాలూ కాయండి.

శాస్త్రి : ఇదుగో వీడేనండి ఆ స్కాండ్రిల్ !

మూర్తి : చోరీకి వచ్చిన వెధవ అంతటితో ఆగాడా? పిస్టలు తీసుకొని బాబుగార్నే కాల్చబోయాడు.

శాస్త్రి : సమయానికి మేం వచ్చాంగాబట్టి సరిపోయింది.

సబి : అయితే సీనియర్ హాండే నన్నమాట!

నారా : కానివ్వండి. తుచ్ఛపువెధవ! డొక్కబ్రద్దలుచేయండి. నారాయణబాబుతో విరోధమంటే నాగుబాముతో చెలగాటమని తెలిసేలా నలగ్గొట్టండి. ఊఁ, కానివ్వండి.

సబి : ఏయ్. కానిస్టేబిల్! కానియ్.

ప్రసా : ఎస్. ఐ. గారూ! పనిచేసేముందు మంచీచెడ్డా ఆలో చించి మరీ చెయ్యడం మంచిది.

సబి : (పోలీసును ఆగమని సైగచేసి, మధువద్దరకు వస్తాడు. బాబు ప్రసాద్‌ను చూసి పండ్లునూరతాడు.)

సబి : ఎవరు నువ్వు ?

మధు : మనిషిని_

సబి ; అది కాదోయ్ ఫూల్ ! నీ పేరేమిటని ?

మధు : మధు.

సబి ; ఈ యింట్లో కెందు కొచ్చావ్?

మధు ; చెప్పినందువల్ల ప్రయోజనం ?

సబి : అది వేరేసంగతి ? నేనడిగేదానికి సమాధానం చెప్పు.

మధు : అయితే నే నడిగేదానిక్కూడా సమాధానం చెప్పాలి.

సబి ; మేం నీకు చెప్పే దేమిటి ?

మధు ; నేను మాత్రం మీకు చెప్పేదేమిటి ?

సబి : షటప్ !

శాస్త్రి : విన్నారా ? వాడివెటకారపు సమాధానం?

మూర్తి : పక్కలిరగదంతేసరి తిన్నగా చెబుతాడు.

నారా : తీసుకుపోండి. యిక్కడనుంచి వెంటనే తీసుకుపోండి. వెధవకు బుద్ధివచ్చేలా చీకటికొట్లో పెట్టి చితగ్గొట్టండి.

మధు : అలాఅని నన్నేం బెదిరించనక్కర్లేదు. కాని ఒకరోజున మీరుకూడా చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తం అనుభ వించాల్సివుంటుం దని మాత్రం మరచిపోకండి.

సబి : ముయ్ నోరు. ఏయ్ కానిస్టేబుల్ వెయ్ బేడీలు. (బాబు తో) వీడిఅంతం మేం కనుక్కుంటాంలెండీ, శలవు. (మధుని తీసుకొని వెళ్తారు)

మూర్తి : మాకు చాలాప్రొద్దుపోయింది. మేంకూడా వస్తా మండి.

నారా : అలాగే! (పొద్దున్నే రండోయ్)

శాస్త్రి : తప్పకుండా వస్తాం శలవు (వెళ్తారు.)

నారా : ఎక్కడికి కెళ్ళావురా?

ప్రసా : ఎప్పుడు?

నారా : యిప్పుడే!

ప్రసా : ఊళ్ళోకి.

నారా : ఎందుకు?

ప్రసా : కేసులు చూడ్డానికి.

నారా : అంతవరకేనా యింకా స్వంతపనులున్నాయా!

ప్రసా : అంటే!

నారా : అర్థం కావడం లేదూ?

ప్రసా : కాలేదనే చెప్పేది.

నారా : సరే. సత్రిందగ్గరకు ళ్లావా

ప్రసా : వెళ్ళాను.

నారా : ధర్మయ్యను చూశావా?

ప్రసా : చూశాను.

నారా : ఇకనుంచి నువ్వక్కడికి వెళ్ళకూడదు.

ప్రసా : కారణం?

నారా : అది నీ కనవసరం.

ప్రసా : ఒకచోటికి వెళ్ళకూడ దనే నిర్ణయం డాక్టర్లకు వర్తించదు.

నారా : వర్తించి తీరాలి.
ప్రసా : అసంభవం.
నారా : నేను చెప్పినమాట వింటావా, లేదా ?
ప్రసా : మంచిదయితే సంశయించకుండా వింటాను.
నారా : అది నిర్ణయించవల్సింది నేను.
ప్రసా : అందరకీ అంతరాత్మంటూ వుంటుంది.
నారా : అది తెలుస్తూనే వుంది.
ప్రసా : తెలిస్తే మంచిదే.
నారా : అంతే కాదు. నాకు బుద్ధులు చెప్పగలిగేటంత పెద్ద వాడవయ్యావనికూడా తెలుస్తూంది.
ప్రసా : అయితే యిదంతా అనవసరం.
నారా : (కోపంతో) అనవసరమా ! బుద్ధిహీనుడా ! చిన్నతనం నుంచీ నాసొమ్ము తిని చివరి కిప్పుడు నారొమ్ముగుద్దడానికే సిద్ధపడుతున్నావా ?
ప్రసా : అపార్థం చేసుకుంటున్నారు.
నారా : అద్దంలా కనిపిస్తుంటే అపార్థం చేసుకోవడం ఏమిటి. నీలాంటి విశ్వాసఘాతకుడ్ని పెంచడం నాదే పొరపాటు.
లీల : (భయంతో) నాన్నా ...!
కోటా : కాస్త నిదానించండి బాబూ!
నారా : అయితే అక్కడకు వెళతా వన్నమాటే కదూ?
ప్రసా : వెళ్ళకపోవడానికగ్గల కారణాలు కనిపించడం లేదు.
నారా : అయితే వెళ్ళు. అక్కడే వుండు. శాశ్వతంగా అక్కడే వుండు. నాయింటో మరి అడుగుపెట్టకు.
లీల : నాన్నా ... నన్ను జూసైనా ... .

కోటా : కనికరించండి బాబూ !

నారా : వీల్లేదు. ఇంక ఒక్కక్షణంగూడా నాయింటో వుండ డానికి వీల్లేదు.

లీల : నాన్నా ...!

నారా : లిలా ! నీకు తెలీదు. నువ్వు మాట్లాడకు.

కోటా ; మీారన్నా కాత్త తగ్గండి సినబాబూ! పెదబాబుగారు కోపంలో వున్నారు.

ప్రసా : అదేమిటీ కోటాయ్! అలాఅంటావ్. తగ్గడానికి మనం తెగబడిం దేమీా లేదుగా !

నారా : అవును, పాపం ! తెగబడ్డావా ? లేదు. లేదు. కాక పోతే నాకు శత్రువైనవాడితో స్నేహంచేస్తున్నావ్. ఒకటక్కులాడి కోసం కుక్కలా ప్రవర్తిస్తున్నావ్.

ప్రసా : ఆపండి, అర్థంలేని ప్రసంగం !

నారా ; (మరీ కోపంతో) ఆపాలా? అప్రాచ్యుడా ! యీానాటికి నన్ను శాసించేవాడివయ్యావన్నమాట! అయితే ఆపుతున్నా. ఆఖరిమాట విను. దిక్కులేకుండా తిరిగే దరిద్రుడ్ని నిన్ను చేరదీశాను. ఆదరించాను. ఆశలు పెట్టుకున్నాను. కాని చెప్పులుకొరికే కుక్కను చేరదీసి నట్టయింది. నీచుడా! అందుకే చెబుతున్నాను. నన్ను వ్యతిరేకించే నీచులు నాయింటోవుండడానికి వీల్లేదు. పోవాలి- తప్పకుండా, యిక్కడినుండి పోవాలి. పో! (అంటూ తాను గబగబాపోతాడు. ప్రసాద్ అంతు లేని ఆలోచనలో పడతాడు. అలా ఆలోచిస్తూనే కుర్చీలో కూలబడతాడు.)

కోటా : ఎందుకు బుర్రపాడుచేసుకుంటారు, బాబూ! నామా టిని పెదబాబుగారి కెదురు శెప్పకండి. నే బతిమాలన్నా ఆరి నొప్పిత్తా. ఆరిమా టినండి బాబూ!

ప్రసా : (మాట్లాడడు.)

లీల : (మెల్లగావచ్చి బుజాలమీద చేతులువేసి) ప్రిసాద్!

కోటా : నువ్వైనా శెప్పు, తల్లీ! నీమాటన్నా యింటారేమో! యిప్పుడే వత్తా. (లోపలికి వెళ్తాడు)

లీల : (ప్రసాద్ కెదురుగావచ్చి కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ దీనంగా) మాట్లాడవేం, ప్రసాద్! నామాట వినవూ. దయవుంచి నాన్నగారి కెదురు చెప్పకుండా వుండవూ? (ప్రసాద్ కాళ్లమీదకు జారుతూ) నమ్మాను. నాహృదయాన్ని నీకర్పించాను. కోరికలో మనస్సును పూరించుకున్నాను. నాఆశలు నిరాశలుచేస్తావా? నాప్రేమను తిరస్కరిస్తావా? నన్నునాథను చేస్తావా? నాజీవితం నాశనం చేస్తావా? (బిగ్గరగా యేడుస్తూ కాళ్ళమీద పడుతుంది. ప్రసాద్ యేమీతోచక అయోమయమౌతాడు. లీలను లేవదీస్తూ)

ప్రసా : ఎందు కేడుస్తావు, లీలా! వూరుకో.

లీల : ఏడుపుగాక నా కేం కేం మిగిలింది, ప్రసాద్! దయవుంచి నామాట వినవూ?

ప్రసా : నా కేం తోచటంలేదు. నన్ను కొంచెం ఆలోచించుకోనివ్వు, లీలా!

లీల : అలాగే ఆలోచించుకున్నాక వస్తాను. (వెళ్తుంది)

(ప్రసాద్ అలాగే నిశ్చలంగా ఆలోచిస్తుంటాడు. హృదయంలో సంఘర్షణ రేగుతుంది)

"అంతరంగంలో: అధర్మాల కొలవాలమైన యీసమాజంలో అన్యాయాలు ఆసమాజం కాదని ఆలోచిస్తున్నావా? మూర్ఖుడా! సత్యపథాన్ని సాధించబూనడం సమర్థుల లక్షణం కాదూ! లే. అసమర్థునిలా అణగివుండకు. ప్రచండ భానునిలా ప్రకాశించు." ప్రసాద్ లేచి వెళ్ళబోతాడు. కాని ఏంతోచిందో మళ్ళీ ఆగుతాడు) మళ్ళీలోపల: "సంశయిస్తున్నావా? యీ మార్గం కంటకావృతమని కంగారు పడుతున్నావా? వెర్రివాడా! కర్తవ్యపాలనచేసేవాడు క . రసమస్యలకు బెదిరి కాడిని క్రిందపారేస్తాడా? లే! నీకర్తవ్యాన్ని పాలించు. ఆత్మశుద్ధిగా మాటయిచ్చిన అమాయకసోదరి నాదరించు." ప్రసాద్ గబగబా ఒక ఉత్తరంరాసి అక్కడపడేసి తన బ్యాగ్‌తో వెళ్ళిపోతాడు. వెనుకనుంచి లీల 'ప్రసాద్! ప్రసాద్!' అంటూ వస్తుంది. కాని ప్రసాద్ వినిపించుకోకుండా వెళ్ళిపోతాడు. లీల వుత్తరంతీసి చదివి ముఖంకప్పుకొని ఏడుస్తుంది.]

కోటా : (వస్తూ) ఏం జరిగింది, తల్లీ ! సినబాబుగా రేరీ ?

లీల : యింకెక్కడి చినబాబుగారు, కోటాయ్! వెళ్ళిపోయారు.

కోటా : యెల్లిపోయారా? మన ల్నిడిశిపెట్టి యెల్లిపోయారా?

లీల : అవును. యిదిగో యీవుత్తరంరాసి యిక్కడపడేసి వెళ్ళిపోయారు.

కోటా : యిశారించకు, తల్లీ ! సినబాబుగా రెక్కడున్నా సరే, బతిమాలనా తీసుకొత్తా. నువ్వు దయిర్యంగా వుండు తల్లీ ! అన్నిటికీ ఆ బగమంతుడే వుండా .

(అలాగే ఆలోచిస్తుంటారు.)

తెరపడుతుంది.

# నేటి న్యాయం

రంగము 6.

[రెండవరంగం మాదిరే. ధర్మయ్య మంచంమీద వుంటాడు. గుణ యేదో వర్దుతుంటుంది.]

ధర్మ : న న్నెరుగున్న డాక్ట రెవరమ్మా, యీ వూళ్ళో?

గుణ : ఏమో నాన్నా! నిన్ను బాగా యెరుగున్నా నన్నాడు.

ధర్మ : అతని పేరు?

గుణ : తెలుసుకోలేదు నాన్నా! కాని, యెంతమంచివా డనుకున్నావ్? నన్ను చెల్లీ! అని ఎంత ఆదరంగా పలకరించాడు.

ధర్మ : ఎలాగైనా ఎవర్నీ నమ్మడానికి వీల్లేదమ్మా!

గుణ : కాదు నాన్నా! అత నలాంటివాడు కాదు. మన కథ విని తప్పకుండా సాయంచేస్తా నన్నాడు.

ధర్మ : లోకంలో ధర్మాత్ము లుండకపో రనుకో. కాని నాకు తెలిసేవరకూ నమ్మలేను.

గుణ : పిచ్చిపిచ్చి అనుమానాలు పెట్టుకోకు నాన్నా! అతన్ని చూ స్తే ను వ్విలా అనలేవు.

ధర్మ : సరే. అది తర్వాత తెలుస్తుందికాని, మధు యింతవరకెక్కడి కెళ్ళినట్టో తెలియడంలేదు.

గుణ : నాకూ అదే భయంగావుంది, నాన్నా. యింతపొద్దుపోయింది. యింతవరకూ రాలేదు. మనస్సు పాడుచేసుకుని యెక్కడ తిరుగుతున్నాడో యేమో!

ధర్మ : కష్టాలు ఒంటరిగా రావు, తల్లీ! అన్నీ కట్టగట్టుకుని ఒక్కసారే విరుచుకుపడతాయి.

గుణ : (ప్రక్కకు చూస్తూ) ఎవరో వస్తున్నట్టున్నారు. అన్నయ్యేనేమో?

(మూర్తి వచ్చి లోపలికి వెళ్లబోతూ ఆగుతాడు.)

మూర్తి : ఆఁ! మీ పేరే కదూ ధర్మయ్య?

ధర్మ : (లేస్తూ) అవును బాబూ!

మూర్తి : అయితే మీరే నన్నమాట!

ధర్మ : ఏం? ఎందుకు బాబూ!

మూర్తి : ఆఁ! ఏమీ లేదు లే.

ధర్మ : చెప్పండి బాబూ! యిన్నాళ్ళనుంచీ లేనిది యిప్పుడు నా పేరెందుకు క్కావల్సివచ్చింది?

మూర్తి : నీకొడుకున్ను అరెస్టుచేయించారు, నారాయణబాబుగారు.

గుణ : (ఒక్కసారిగా) అరెస్టా?

మూర్తి : అవును. యిప్పుడే జైలుకు తీసుకుపోయారు, పాపం! యీముసలితనంలో మీ కిది చాలాకష్టమైనవిషయం.
(ధర్మయ్య నిశ్చేష్టుడవుతాడు.)

గుణ : (ఆందోళనగా మూర్తి దగ్గరకు వచ్చి) చెప్పండి, మా అన్నయ్య నెందుకు జైలుకు తీసుకుపోయారు? మా అన్నయ్య అంత అపరాధం ఏంచేశాడు? చెప్పండి.

మూర్తి : నారాయణబాబుగారి యింట్లో దొంగతనం చేసి ఆయన్ని హత్యచెయ్యబోయాడట! అందుకు.

గుణ : మా అన్నయ్య దొంగతనం చేశాడా? వట్టిది. ఒక్క నాటికి అలా చెయ్యడు. మమ్మల్ని సర్వనాశనం చెయ్యాలని ఆ బాబే యిలా పన్నివుంటాడు.

మూర్తి : అదీ నిజమే కావచ్చు. కాని పనిజరిగిపోయింది.

ధర్మ : (నిశ్చలంగా చూస్తూ) పోయింది. మినుకుమినుకుమంటున్న ఆశాజ్యోతి ఆఖరయిపోయింది. కాదు చీకట్లతో లోకం గాఢాంధకారమై పోయింది. లోకంలో శోకం నాకింకేమని చిందులు తొక్కుతోంది. (వెర్రిగా నవ్వుతాడు.)

గుణ : నాన్నా! (దగ్గరకు వచ్చి) ఘాముకో నాన్నా! మనసు కంగారు పెట్టుకోకు నాన్నా!

మూర్తి : పాపం, మతిచలించినట్టుంది. కాస్త జాగ్రత్తగా చూడండి. వస్తాను. (వెళ్తాడు.)

ధర్మ : గతిలేని ప్రపంచానికి మతిలేని ముఠాధిపతులు. (వెర్రిగా నవ్వుతూ) నవ్వుతున్నావా? నన్ను పిచ్చివాడినిగా భావించి నవ్వుతున్నావా? నాకుటుంబం నాశనమైందని నవ్వుతున్నావా? నవ్వు. బాగానవ్వు. పొట్టచెక్కలయ్యేటట్టు నవ్వు. కాని నువ్వుమాత్రం బావుకుచచ్చేదేమిటి? స్వార్థపరులపాదాలకు సాగిలబడి మొక్కుతున్నావ్. కరువు గురువుల పరువులకోసం మురిసిపోయి మొరగా మారావ్. కొరవితో తలగోక్కున్నానని యేడుస్తూనే తన్ను జూచి నవ్వుతున్నావా! మూఢుడా నవ్వు. నాకేం భయమనుకున్నావా? నీ

గోతిలో నువ్వే పడ్డావ్. నీకంఠాని కురితాళ్ళు నువ్వే తెచ్చుకున్నావ్ (నవ్వుతాడు).

గుణ : (కంగారుగా) నాన్నా! వూరుకో నాన్నా! అదిగో మేఘాలుపట్టాయి. వర్షంవచ్చేలా వుంది. వురుముతోంది కూడా. నాకు భయమేస్తోంది. వూరుకో నాన్నా! (వురుములతో గాలివాన ప్రారంభమవుతుంది.)

ధర్మ : అవును. వెళ్ళాడు. అంతేకాదు. వురికంబాన్నికూడా యెక్కుతాడు. ఎక్కాలికూడా—ఆవేడిరక్తంతోగాని యీపాడులోకం ప్రజ్వలించదు?... పాతిపెట్టిన న్యాయం బయటికిరావాలంటే ఎన్నిప్రాణాలు బలికావాలో. అప్పుడుకాని యీ లోకాని కంతుపట్టదు ... ... ఎక్కాలి, నాకొడుకు వురికంబం యెక్కాలి. (బిగ్గరగా అరుస్తుంటాడు.)

గుణ : నాన్నా! వూరుకో నాన్నా! (అంటూ తండ్రిని గట్టిగా కౌగిలించుకొని యేడుస్తుంటుంది.)

ధర్మ : (బాధవస్తుంది.) అమ్మా ... అబ్బ ... నొప్పి ... అమ్మా ... (మనిషితూలిపోతుంటాడు.)

గుణ : నాన్నా! కాసేపు పడుకో నాన్నా! (మెల్లగా మంచం మీద చేరుస్తుంది. ధర్మయ్యకు స్పృహతప్పుతుంటుంది. గాలివాన తీవ్రమవుతుంది. జల్లుకొట్టడంవల్ల ధర్మయ్య మంచం తడుస్తుంది. గుణ మంచాన్ని అటూయిటూ పరుతుంది. కాని జల్లుకొడుతూనేవుంటుంది. చివరకు హతాశయై ఏడుస్తూ "నాన్నా" అంటూ తండ్రిమీద పడిపోతుంది. దూరాన పాట క్షీణబడుతుంటుంది.)

(తెరలో) పాట

ఇంతేనా యీలోకం
యిదా మనుజలోకం ॥యిం॥
ఆకలిజ్వాలల కాహారంబై
హాహాకారా లొకచోట
ఆకలిమాట అసలే తెలియని
ఆనందం బింకొకచోట ॥యిం॥
అర్ధరాత్రి జడివానలోన
నిలువనీడలే దొకచోట
సుందరసౌధాలందున మెత్తని
పరుపులనిద్రలు ఒకచోట ॥యిం॥

(క్రమంగా వర్షం వెలుస్తుంది. పాట ఆగిపోతుంది. ముస్తాబై మూర్తి వస్తాడు. చేతిలో హంటరు వుంటుంది.)

మూర్తి : (సిగరెట్ ముట్టించి సకిలిస్తాడు.) పాపం! చాలా ఆపదలో పడ్డారు.

గుణ : (మెల్లగా తల పైకెత్తుతుంది.)

మూర్తి : ఇందాకట్నుంచీ మీారు పడుతున్న అవస్థంతా కిటికీలోనుంచి చూస్తూనే వున్నా.

గుణ : (మెల్లగా లేస్తుంది.)

మూర్తి : పాపం! స్వర్గసుఖాలతో కాలంగడపవలసిన నువ్వు యిలా అష్టకష్టాలూ అనుభవించడం చూస్తే నాకు మహా జాలేస్తోంది.

గుణ : (మాట్లాడదు.)

మూర్తి : ఈ ప్రపంచంలో పరులకష్టాలు పరికించనివాడు పాపాత్ముడు కాదూ! అందుకే యిలా వచ్చాను.

గుణ : (వికటంగా) పరోపకారపారీణులని మీముఖమే చెబుతోంది.

మూర్తి : (తెలుసుకోలేదు) అవును. నువ్వు గ్రహిస్తావని నాకు తెలుసు. అంత తెలివిగలదానవనే ఆదరించాలని ...

గుణ : అక్కర్లేదు, ఆపండి.

మూర్తి : (షాక్ కొట్టినట్టవుతుంది.) అక్కర్లేదూ? కారణం?

గుణ : అది మీ కనవసరం.

మూర్తి : అయాచితంగా వచ్చే ఆదరాన్ని తిరస్కరించడం అంత మంచిపని కాదు.

గుణ : కల్మషహృదయుల సహాయాన్ని కాంక్షించడం అంతకన్నా మంచిది కాదు.

మూర్తి : పొరబడుతున్నావ్ !

గుణ : నే నేమీ పొరబడ్డం లేదు.

మూర్తి : నాసంగతి నీ కేం తెలుసు ?

గుణ : తెలుసు. నీసంగతి నాకు బాగా తెలుసు. డాక్టరుగారితో నువ్వుచెప్పిన మాటలుకూడా నాకు తెలుసు.

మూర్తి : (గ్రహించి నవ్వుతూ) ఓహో, అదా ? అయితే ఆ డాక్టరేదో నామీద కక్షయింటు చేశాడులా వుందే! తనేదో పెద్దధర్మాత్ముడు, నేనేమో పొరబడుదాయిని. అంతేకదూ, ఆతను చెప్పింది?

గుణ : అది యదార్థమేగా!

మూర్తి : ఏమిటి యదార్థం? నిజానిజాలు తెలుసుకోకుండా నిష్ఠూరంగా మాట్లాడ్డం సహించరానివిషయం.

గుణ : తెలుసుకోవాల్సిం దేమీ లేదు.

మూర్తి : లేదూ? సరే. అసలత నెవరో తెలుసా?

గుణ : దాక్షిణ్యం గల డాక్టరు.

మూర్తి : దాక్షిణ్యం, దయ! నాలుగుమాయమాటలు చెప్పే సరికి వుబ్బితబ్బిబ్బవుతున్నావ్. అసలుసంగతి తెలుసు కుంటే అతనిపస అప్పుడు తెలుస్తుంది ...యింతకూ మీ సంసారాన్ని యీకాడికి తెచ్చిం దెవరు? నారాయణబాబు కాదూ? ఆ నారాయణబాబుకు యీ డాక్టరేమవుతాడో తెలుసా?

గుణ : ఏమవుతాడు?

మూర్తి : ఏమవుతాడా? మేనల్లు డవుతాడు.

గుణ : (ఆశ్చర్యంగా) మేనల్లుడా!

మూర్తి : వట్టిమేనల్లుడే కాదు. కాబోయే స్వంతఅల్లుడు.ఆయన ఆస్తికంతకూ హక్కుదారుడు కూడాను.

గుణ : నిజంగానా?

మూర్తి : ఆఁ! మ రేమనుకున్నావ్? యిదంతా అక్షరాలా నిజం. యిది వాడు చెప్పాడా? లేదు. ఎందుకు చెబుతాడు? అలా చెబితే ను వ్వతన్ని నమ్మవుగా. యిప్పుడు తెలిసిందా వా డెలాంటివాడో?

గుణ : (ఒక్క క్షణం బిత్తరపోతుంది. కాని మళ్ళీ సర్దుకుంటుంది) ఏమయినా కానివ్వండి. అందువల్ల నాకొచ్చిన నష్టం ఏమీ లేదు.

మూర్తి : లేకపోవడ మేమిటి? కావల్సినంత నష్టంవుంది. అందుకనే నా కింత ఆరాటం.

గుణ : పాపం యెందుకో?

మూర్తి : ఎందుకో నాకూ తెలియడంలేదు, యినుములాంటి నామనస్సును యిట్టే ఆకర్షించగలిగావ్.

గుణ : పిచ్చి ముదురుతున్నట్టుంది.

మూర్తి : నిజంగా పిచ్చిపట్టేలాగే వుంది.

గుణ : అయితే యినపగొలుసులు తగిలించి విశాఖపట్నం పంపించాల్సివుంటుంది.

మూర్తి : అక్కరలేదు. నా పిచ్చిని కుదర్చగలిగిన దానివి నువ్వే.

గుణ : ఆపండి, అర్థంలేని సంభాషణ.

మూర్తి : కాదు. అర్థంవుంది... గుణా! నీకోసం... నీప్రేమ చూపుకోసం వొళ్లంతా కళ్ళుచేసుకుని చూస్తున్నా. నీ మధురసంభాషణకోసం ముఖమంతా చెవులు చేసుకొని వింటున్నా. గుణా!... ఒక్కసారి...

గుణ : (తీవ్రంగా) చాలించండి.

మూర్తి : నే నొక లక్షాధికారిని. కావాలంటే కావలసినంత మందిని కాళ్ళదగ్గరకు రప్పించగలను. కాని నా మనస్సెందువల్లో నీమీదే నిలచిపోయింది. నిన్ను నా ఆరాధ్యదేవతగా పూజిస్తాను. ఆనందడోలికల్లో వూగిస్తాను.

రా. నా ప్రేమను మన్నించి నీ జీవితాన్ని సార్థకం చేసుకో.

గుణ : ఛీ! నీచుడా! కట్టిపెట్టు.

మూర్తి : (ఆత్మాభిమానంతో) ఆఁ! ఏమన్నావ్? నీచుడ్నా? సరే! ప్రేమ ద్వేషంగా మారితే ఏం జరుగుతుందో తెలుసా?

గుణ : ఏం జరుగుతుంది?

మూర్తి : పగబడుతుంది. పగబట్టిన త్రాచు పడగెత్తక మానదు.

గుణ : పడగెత్తినపాము ఫలితాన్ని కూడా అనుభవించకపోదు.

మూర్తి : ఆలోచించుకో. నీ భవిష్యత్తూ నీకుటుంబ భవిష్యత్తూ కూడా ఆలోచించుకో. నీఅన్నయ్యను జైలునుండి తప్పిస్తాను. నీతండ్రికి సరియైన వైద్యంచేయిస్తాను: కాదంటావా? నీఅన్నయ్య హత్యానేరానికి వురికంబా న్కెక్కుతాడు-యీరాత్రి, యీచలితో నీతండ్రి చస్తాడు.

గుణ : (బెదిరిపోతుంది.) మీకు నమస్కరిస్తాను ... నాతండ్రిని రక్షించండి. దయవుంచి యీరాత్రికి మీపంచలో తలదాచుకోనివ్వండి. పదండి. యింకా యీచలిలోనే వుంటే నాతండ్రి కేమవుతుందో! పదండి. (ముందుకు వెళ్ళబోతుంది.)

మూర్తి : (ఆపుతూ) ఆగు; ముందు నాచేతిలో చెయ్యివెయ్యి. (చెయ్యిచాపుతాడు.)

గుణ : (అభిమానంతో) ఛీ, పశువా! నాతో ప్రమాణం చేయిస్తున్నావా? నువ్వు మనిషివి కావూ? సిగ్గులేదూ? సిగ్గులేదూ? నీకు తోబుట్టువుల్లేరూ? కామాంధుడా! నా కుటుంబపతనాన్ని చూసి, నాశీలాన్ని చెరపచూస్తు

న్నావా? నాబ్రతుకు నడిబజారులో పెట్ట సాహసిస్తు న్నావా? నీలాంటి దుర్మార్గులు చెప్పే మాయమాట లకు మోసపోయేంత అమాయకురాల్ని కాదు. నీలాంటి తుచ్ఛులు, నీచులు-

మూర్తి : (కోపంతో) ఆ, ఏమన్నావే? (హంటరుతో పెడేలు లున కొడతాడు. గుణ "హా" అంటూ పడిపోతుంది. బయట కారుహార్న్ వినబడుతుంది. మూర్తి కంగారుగా లోపలికి పరుగెడతాడు.)

తెరలో: పాట

ఆంధ్రుడా
కానగా లేవా
యిటు కానగా లేవా॥
పావన శీలము
పాడగు టదియె
ఆపదలందున క్రుంగుమానవతి
మానముజెరిచే దుష్టరాక్షసుల ॥కా॥

(ప్రసాద్ చరచరా వస్తాడు. వెనుక వేణు. యిద్దరూ తడిసివుంటారు.)

ప్రసా : (గుణను చూసి) చెల్లీ! చెల్లీ! (లేవదీస్తాడు.)

గుణ : (మెల్లగా కళ్ళు తెరచి) అన్నయ్యా! (ఏడుస్తుంది.)

ప్రసా : ఏడుస్తా వెందుకమ్మా? ఏం జరిగింది? చెప్పు. (లేవదీస్తాడు. గుణ దెబ్బవల్ల బాధపడుతుంది.)

ప్రసా : అదేమిటి? (చెయ్యిచూస్తూ) ఎవడు? ఎవడిలా కొట్టాడు?

గుణ : ఆ దుర్మార్గుడు కొట్టా డన్నయ్యా ! (లోనికి చూపు తుంది.)

ప్రసా : ఎవడు మూర్తా ?

గుణ : వాడే నన్ను బలవంతంచేసి నేను వ్యతిరేకి స్తే యిలా కొట్టాడు.

ప్రసా : (కోపంతో) ఆఁ, రాస్కెల్. (చరాల్న వెళ్ళబోతాడు)

వేణు : (ఆపుతూ) ఆగరా బ్రదర్ ! ఆగు. యిది సమయం కాదు. ఆడదానిమీద ప్రతాపం చూపిన ఆమగపురు షుడు తలుపులు బిడాయించుకూర్చున్నాడు.

ప్రసా ; తలుపులు పగలదన్నయినాసరే బయటికీడ్చుకొస్తాను.

వేణు : అది వట్టిప్రయాస. యిప్పుడుపోతే రే పెక్కడికిపోతాడు. ముందీ చలిలోనుంచి వీళ్లను తీసుకుపద !

ప్రసా : (ధర్మయ్యను చూసి) తొందరగా యిక్కడనుండి మకాం మార్చాలి. గుణా ! నీబట్టలూ అవీ తీసుకో. వేణూ ! కారు వద్దకు రోగిని తీసుకుపోదాం, రారా.

(యిద్దరూ మంచంమోత్తుతుంటారు.)

(తెరపడుతుంది)

# నేటి న్యాయం

---

రంగము 7.

[మొదటిరంగంమాదిరే. లీలా, మూర్తీ కూర్చునివుంటారు. నారాయణ బాబు కోపోద్రేకంతో అటూయిటూ తిరుగుతుంటాడు. కోటాయ్ ఒక ప్రక్క ఒదిగి నిలబడివుంటాడు.]

లీల ; ఇదంతా యదార్థమే నంటావా మూర్తీ!

మూర్తి : ఇంకా సందేహిస్తున్నావా? లీలా! యదార్థం. మన వాడా పల్లెటూరిపిల్లతో లేచిపోయినట్టు వూరూ నాడూ అంతా అల్లరయిపోయింది. ఎక్కడచూచినా యీ గుస గుసలే!

లీల ; ప్రసాదిలా ప్రవర్తిస్తాడని కలలోకూడా అనుకోలేదు.

నారా : నీచపువెధవ నీచంగా ప్రవర్తించక, సక్రమంగా ప్రవర్తిస్తాడా?

మూర్తి : అయినా వాడి కిప్పుడొచ్చిన నష్టంమాత్రం యేముంది లెండి. డబ్బుఖర్చుపెట్టి చదివించారు. డాక్టర్ని చేశారు. ఎక్కడుంటేనేం? బ్రతకలేడా?

నారా : చేశాను. పామును పెంచినట్టు పెంచి యింతవాడ్ని చేశాను.

మూర్తి : మీరుమాత్రం తెలిసిచేశారటలెండి! ఏదో దిక్కులేనివాడుగదా అని చేరదీశారు. దాన్ని నిలబెట్టుకో లేకపోయాడు.

నారా : కానీ, మించిపోయిం దేమీ లేదు. వీ డెక్కడున్నా సాధించి నాశనంచేసితీర్తాను.

లీల : యింతకూ యెక్కడున్నాడో తెలుసా? మూర్తీ!

మూర్తి : అబ్బే! యింకా తెలీదు.

శాస్త్రి : ఇంకా తెలియకపోవడ మేమిటి? (గబగబా వస్తాడు)

మూర్తి : ఏమిటి? ఎక్కడున్నాడురా?

శాస్త్రి : ఇంకా యెక్కడేమిటి? అనుకున్నంతా అయ్యింది.

లీల : ఏం జరిగింది, శాస్త్రీ!

శాస్త్రి : ఏముంది? వా డిక్కడే, యీవూళ్ళోనే, మనముఖం మీాద కొట్టినట్టు తిష్టవేశాడు.

మూర్తి : యెక్కడున్నాడురా?

శాస్త్రి : వాడే - ఆదరిద్రుడు వేణూగాడు లేడూ - వాడింటి దగ్గరే - ఆపిల్లతో మకాంపెట్టేశాడు. అంతేనా, అరెస్టయిన మధును జెయిలునుండి విడుదలచేయించి కేసుకూడా నడిపిస్తాడట!

నారా : అంతవరకు వచ్చాడూ వెధవ. రానీ! నాప్రతాపం, వాడిప్రతాపం లోకానికి తెలుస్తుంది.

శాస్త్రి : వాడిమాట అలావుంచండి. ఆ వేణూగాడి కెలా బుద్ధిలేదంటూ, వీళ్ళ నింట్లో పెట్టుకోడానికి!

నారా : బరి తెగిన వెధవలకు నీతా, జాతా?

మూర్తి : అంతేలెండి.

శాస్త్రి : (ప్రక్కకుచూస్తూ) అదుగోరా. వాడూ యిక్కడికే వస్తున్నాడు. మాట్లాడక.

(వేణు వస్తాడు)

వేణు : (నమస్కరిస్తూ) నమస్కారం, నారాయణబాబుగారూ!

నారా : (కోపంముతో గంభీరంగా) ఎందుకు దయచేసినట్టు?

వేణు : మీతో కొంచెం మాట్లాడాల్సివుంది.

నారా : ఏమి టది?

వేణు : చెప్పమంటారా ?

నారా : మానెయ్ !

వేణు : మానమన్నా చెప్పాల్సిన బాధ్యత నామీద వుంది.

నారా : అవును. నాకూ తెలుసు. నీకు బాధ్యత లుంటాయని. లేచిపోయిన రకాన్ని యింట్లో పెట్టుకొని నాటకమాడే వాడికి ఆమాత్రం బాధ్యత లుండవూ !

వేణు : పొరబడుతున్నారు_

నారా : పాపం! అలాగేం? అయితే ఆ పొరపాటును సరిదిద్ద డానికి వచ్చావన్నమాట ! (తీవ్రంగా) వేణూ! మీ కపటనాటకాల్ని తెలుసుకోలేనంత మూర్ఖుడ్ని కాదు.

వేణు : కావచ్చు. కాని యితరులమాటలు విని మోసపోతున్నా రేమో? కొంచెం ఆలోచించమంటాను.

మూర్తి : అదేమిటి ? అంతమోసం చెయ్యాల్సిన అవసరం ఎవడి కొచ్చింది ?

శాస్త్రి : వాడి కలాంటి బుద్ధు లుంటాయికదూ! అందుకని అం దరూ అలాగే అనుకుంటాడు.

వేణు ; ఆగండోయ్, అంతటితో. మనపురాణమంతా బయట పెడితే, అప్పుడు తెలుస్తుంది మజా.

కోటా : అ దేమిటో బయటపెట్టు, బాబూ!

మూర్తి : (కోపంగా) ఏమిటా?! ఏమిటి? నువ్వు బయటపెట్టేది?

శాస్త్రి : తనతప్పు దాచుకోవాలంటే, ఎదుటివాడినెత్తిన ఏదో రుద్దాలిగా!

వేణు : బాగా కుదిరిందిరా జోడు – కొంప లార్పడానికి!

మూర్తి : ఓహోహో! కొంపలు నిలబెట్టేఘనుడు బయల్దేరాడయ్యా నేటికి.

శాస్త్రి : అవున్రా, యిప్పుడు వాడు చేసేది అదేకదూ!

లీల : యింతకూ ఆ వున్నవిషయ మేమిటో చెప్పు, వేణూ!

నారా : ఏమీ చెప్పనక్కరలేదు. దయచేయొచ్చు.

వేణు : వెళ్లాలా? వెళ్తాను. కాని ఒక్కమాటమాత్రం చెబుతున్నాను.

నారా : ఏమిటది?

వేణు : మీరు చేసేది మహాదారుణం!

నారా : ఏమి టా దారుణం?

వేణు : ధర్మయ్య సంసారాన్ని నాశనంచెయ్యడం.

నారా : నేనా నాశనం చేసేది?

వేణు : అవును.

నారా : ఏవిధంగా?

వేణు : అది మీకే తెలుసు.

నారా : మరి నువ్వు చెప్పేదేమిటి?

వేణు : వాళ్లు కోరినట్టు మీ కాతాలు చూపించమని.

నారా : అంతవరకేనా, యింకా ఏమయినా చూపించాలా?

వేణు : అంటే–

నారా : నా ఆస్తిపాస్తుల వివరాలుకూడా చూపించాలేమోనని.

వేణు : అది వాళ్ళ కనవసరం.

నారా : ఈ నీతులు చెప్పడం నీ కంతికన్న అనవసరం.

వేణు : అవును మరి. అలా చూపించడానికి భయం.

నారా : ఎందుకు భయం ?

వేణు : గుట్టు బట్టబయు లవుతుందని.

నారా : (కోపంతో) షటప్.

వేణు : అది యథార్థం కాకుంటే ఖాతాలు చూపించడానికింత గందరగోళంపడాల్సిన పనిలేదు.

మూర్తి : తగ్గరా అక్కడికి.

వేణు : తగ్గాలిరా ? తగ్గుతాను. అవును, ఆపదలోవున్న ఆడ. దాన్ని అవకాశంచూసి ఆదరిస్తాననే సాకుతో ఆమె మానాన్ని అపహరించబోయి అందుకు వ్యతిరేకిస్తే హంటరుతో కొట్టే అవినీతిపరుల యెదుట మాలాంటి వాళ్ళు మాట్లాడొచ్చా?

లీల : వేణూ!

వేణు : అవును, లీలా! మోసపుమాటల్తో అన్నాచెల్లెళ్ళను కూడా ఆలుమగలుగా చిత్రించే అధమాధముల కె యిక్కడ స్థానం వుంది. వాళ్ళమాటలే యిక్కడ వేదాలు. వాళ్ళే ధర్మదేవతలు.

నారా : (బిగ్గరగా) వేణూ!

వేణు : (అదే స్థాయిలో) నారాయణబాబుగారూ! అధికారం చేతిలోవుందికదా అని అంతులేని అత్యాచారాలు చేస్తూ అమాయకులసంసారాల్ని హతమారుస్తున్నారు. పేదవాళ్ళ జీవితాలు పనికిరాని శవాలుగా భావించి

ప్రవర్తిస్తున్నారు. అందుకు ధర్మయ్య సంసారమే నిదర్శనం. తప్పుడుసాక్ష్యం చెప్పనన్నాడనే సాకుతో వాళ్ళ సంసారాన్ని సమూలంగా నాశనం చెయ్యతలపెట్టారు. కాని న్యాయం యీనాడుగాకపోతే రేపైనా బయట కొస్తుంది. యీ అన్యాయాన్ని అక్రమాన్ని హతమారుస్తుంది. యీమాటలు మరచిపోకండి. శలవు.(వెళ్తాడు)

శాస్త్రి : అరి బ్లడీఫూల్! ఎంత తెగబడ్డావురా?

నారా : కానీ, యెంతవరకు వెళతారో వెళ్ళనీ. నేనూ చూస్తాను. నామార్గాని కడ్డంగావచ్చే నీచుల్ని నామరూపాలు లేకుండాచేస్తాను. (చరచరా లోపలకు వెళ్తాడు)

మూర్తి : మనంకూడా పోదాం పదరా? వస్తాం లీలా! (యిద్దరూ వెళ్తారు. లోపలనుంచి నారాయణబాబు "కోటాయ్" అని పిలుస్తాడు.)

కోటా : వత్తన్నా బాబూ! (వెళ్తాడు.)

(లీల ఒక్కతే వుంటుంది విచారంగా)

పాట

లేదా ఆశ జగతి
కనరాదా ప్రేమకు స్థానం ॥లే॥
కోర్కెలన్ని కూలిపోయె
ప్రేమసౌధ మొరిగిపోయె
గాలిమేడ లాయె ఊహ

ఆశ నిరాశాయె నహా ॥ఆశ॥
నడిసముద్రమున నావ

పెనుతుపానులో వదలి
నావికుం డెటో పోయె
జీవనౌక యేమౌనో ॥లే॥

(కోటాయ్ వస్తాడు)

కోటా : (లీలదగ్గరకు వచ్చి) అమ్మా!

లీల : (కన్నీళ్ళతో) కోటాయ్! (ఏడుస్తుంది.)

కోటా : యేడవకు తల్లీ! యేడిశి చేశే దేముంది? పట్టుదలతో సాధించాలిగాని.

లీల : నాకు మతిపోతోంది, కోటాయ్!

కోటా : పిచ్చితల్లీ! యిటువంటాటిల్లో గుండెనిబ్బరంతో పని శెయ్యాలిగాని, మతిపోగొట్టుకుంటే యెట్టా?

లీల : విన్నావుగా జరిగిందంతా. యిదంతా చూస్తే అయోమయంగా వుంది నాకు.

కోటా : అవును తల్లీ! యిదంతా యేదో పెద్దపన్నాగంలాగా కనిపిత్తోంది.

లీల : యేమో కోటాయ్! ఏమీ తోచటం లేదు.

కోటా : కాదు తల్లీ! వేణూబాబుగారి మాటల్నిబట్టి సూత్తే, యిాళ్ళే యేదో గొడవశేసి సినబాబుగారిమీదకు తోసేత్తున్నట్టుంది.

లీల : అయితే ప్రసాదుమీద రేగే యీ దుమారమంతా వట్టిదే నంటావా ?

కోటా : యింకా అబద్ధమా? తల్లీ! యిదంతా వట్టిదే. సూడలేక శేశేదే!

లీల : అతని కేమీ దురుద్దేశం లేకపోతే యిల్లెందు కొదిలి పోతాడు?

కోటా : శివబాబుగారి సంగతి మీకు బాగా తెలవదు. ఆయన మాటంటే కట్టుపడే మనిషి. యేమైనాసరే మంచిదనుకున్నది జంకూ గొంకూ లేకుండా సేశేమనిషి. అందుకే యిక్కడ వుండడం మంచిదికాదని యిల్లొది లేసుంటారు.

లీల : అయితే యిప్పుడేం చెయ్యాలంటావ్?

కోటా : ఒక్కటేదారి కనిపిత్తాంది, తల్లీ!

లీల : ఏమి టది?

కోటా : కాతాబొక్కులు, కాతాబొక్కులని ఆళ్ళు గందర గోళం శేత్తున్నారే, అయిగాని బయటికి లాగితే అంతా తేలుద్దేమో ననుకుంటానమ్మా.

లీల : అవును కోటాయ్! నాకూ అదే అనుమానంగా వుంది. యేదో లోపం లేకపోతే యెందుకు బయట పెట్టరు?

కోటా : అదే. తల్లీ! అదే. అయిగాని బయిటికిలాగితే అంతా తేలుది.

లీల : అయితే నేను బయటకులాగుతా.

కోటా : అంతదయిర్యం వుందా?

లీల : లేకేం కోటాయ్! యిప్పుడే చూస్తాను వెళ్ళి.

(చరచరా లోపలికి వెళ్తుంది.)

(తెరపడుతుంది.)

# నేటి న్యాయం

రంగము 8.

[వేణుయిల్లు, కుర్చీలు, డ్రాయరు వుంటాయి, గోడలకు నాయకుల ఫొటోలు, మధ్య విశాలాంధ్రమ్యాపు వుంటాయి. వాటికి పూలదండలు వేస్తూ గుణ పాడుతుంటుంది.]

పాట

ఓ ఆంధ్రమాతా
ఓ మాతా
సకల సుగుణోపేత
సన్నుతచరిత మాత! ॥ఓ॥
గలగలా ధ్వనులతో
కలగానము సేయు
దివ్యానదులే నీదు
గళమందు హారాలు
బంగరుపంటలు ఎన్నో
పండించు పుణ్యానదు లివె గాదా! ॥ఓ॥

(సాకీ)

జీవకళ చిందించు
చిత్రకారుల్ల కుంచెలో
కలము కత్తిగ జేయు
కవుల లేఖినిలో
రాల కరగించు
గాయకుల కంఠాలలో

నీరూపు నీఖ్యాతి నీత్యాగ మీధాత్రి
జ్యోతిమై వెలుగంగ జేసెగా ॥ఓమాత॥

ప్రసా : (వచ్చి) ఓహో... చాలాబాగుంది చెల్లీ! నే నెప్పుడూ వినలేదు, నీపాట. ఏదీ యింకోకసారి.

గుణ : అబ్బె! నా కేం పాటలు రావన్నయ్యా! (సిగ్గుపడు తుంది.)

ప్రసా : అబద్ధాలు చెబుతున్నావు. నేను వినలా? ఏదీ, మళ్లా ఒకసారి.

గుణ : అబ్బే, నాకు రావన్నయ్యా!

ప్రసా : నాయెదుట సిగ్గెందుకమ్మా! ఏదీ, పాడు. పోనీ, ఆ చివరభాగం పాడు.

(గుణ "జీవకళచిందించు" దగ్గరనుంచి పాడుతుంది.)

ప్రసా : (చప్పట్లుచరుస్తూ) హియ్యర్, హియ్యర్! సక్లేగాని యీపాట లెవరు నేర్పారమ్మా నీకు?

గుణ : మావూళ్ళో ఎవరో పాడుతుంటే విన్నా నన్నయ్యా! అంతే.

ప్రసా : (గంభీరంగా) నిజంగా మన ఆంధ్రమాత యెంతటి శక్తి సంపన్నురాలో మన కీనాటివరకూ అర్థంకాలేదు.

గుణ : అలా అర్థమయితే యిన్నేళ్ళు పరాధీనంగా వుందు కుంటాం?

ప్రసా : అవును. ఆంధ్రరాష్ట్రంకోసం అనేకమంది వీరులు ఆత్మబలిదానం చేస్తేగాని మన కదిరాలేదు.

గుణ : యిప్పటికీ అసంపూర్ణంగానేగా వచ్చింది!

ప్రసా : అవును. ముక్కోటి తెలుగుబిడ్డలనుకలిపే విశాలాంధ్ర యేర్పడిననాడే మనకోర్కె తీరినట్లు. ఆనాడే తెలుగు జాతి సర్వవిధాలా వికాసాన్ని పొందగలిగేది.

గుణ : అయితే మనకు రాష్ట్రంవస్తే కష్టాలన్నీ గట్టెక్కినట్టేనా?

ప్రసా : ఆఁ, సమర్థులైన నాయకులు సారథ్యంవహిస్తే స్వర్గాన్ని నిర్మించవచ్చు.

గుణ : స్వార్థపరులైన ప్రభువు లైతేనో!

ప్రసా : సంచులు నింపుకోవచ్చు,

గుణ : అయితే ప్రజలగతి?

ప్రసా : దుర్గతే! (నవ్వుతూ) పిచ్చిదానా! యింకా ప్రజ లమాయకులనే తలుస్తున్నావా? వాళ్ళకెవరు మిత్రులో యెవరు శత్రువులో బాగా తెలుసు ఎవరు సమర్థులో వాళ్ళే నిర్ణయిస్తారు.

గుణ : ఒకవేళ వక్రమార్గంలో పడతారో. అనుభవిస్తారు.

ప్రసా : ఆఁ, సరేగాని యీమాటల్లోపడి బాబాకు మందివ్వడం మరచిపోలేదుగద!

గుణ : లేదన్నయ్యా! బాబా కిప్పుడే మందిచ్చాను.

ప్రసా : ఏ మంటున్నాడు?

గుణ : కొంచెం కులాసాగానే వుందంటున్నాడు. (ప్రక్కకు చూసి) అదుగో బాబా యిటే వస్తున్నాడు. (ధర్మయ్య వస్తాడు మెల్లగా)

ప్రసా : ఎందుకు, బాబా! యిటొచ్చారు. మిమ్మల్ని పూర్తిగా విశ్రాంతి తీసుకోమన్నాను కదూ ?

ధర్మ : మ రేం ఫర్వాలేదులే, బాబూ! (కూర్చుంటాడు.)

గుణ : వేణు యెక్కడికి కెళ్లా డన్నయ్యా?
ప్రసా : వా డింకా రాలేదా ?
గుణ : లేదు. పొద్దున మీరిద్దరూ వెళ్లినదగ్గర్నుంచీ యింకా రాలేదు.
ప్రసా : ఎక్కడ కెళ్లా డబ్బా !
గుణ : ఇద్దరూ కలిసే వెళ్ళారుగా ?
ప్రసా : కలిసే వెళ్ళాం. ప్లీడరుగారితో మాట్లాడి, వేరే పేషంటుని చూడ్డానికి వెళ్తూ వాడి నింటికి వెళ్ళమన్నాను.
ధర్మ : మధుసంగతి యేమయ్యింది బాబూ !
ప్రసా : ఈరోజేవిడుద లవుతాడు, బాబా ! ప్లీడరుగారితో మాట్లాడాం. యీపూటే విడుదలచేయించుదా మన్నాడు.
గుణ : అయితే అన్నయ్యా, యీరోజే విడుద లవుతా డన్న మాట !
ప్రసా : ఊఁ, యింకొకగంటకే.
ధర్మ : మునిగిపోతున్న మా సంసారంకోసం మీకష్టాల్నికూడా లెక్కచెయ్యకుండా పనిచేస్తున్నావ్. నీ ఋణం ఎలా తీర్చుకోగలం బాబూ!
ప్రసా : దాని కేంలే బాబా!
ధర్మ : కాదు, బాబూ! స్వర్గసౌఖ్యాలతో కాలంగడపవలసిన నువ్వు మాకోసం యిల్లు వదిలిపెట్టావ్.
గుణ : అంతేనా! ప్రాణంకన్నా యెక్కువగా ప్రేమించేవాడిన్ని విడిచిరాలేదూ ?
ధర్మ : అవునమ్మా! అవును. యిలాంటి సుగుణరాశి ఋణం మనం యెలాతీర్చుకోగలం తల్లీ!

ప్రసా : నే నిలా మారిపోయానంటే, దానిక్కారణం మన గుణ. బాబా! మిమ్మల్ని మొదట్లో అర్థంచేసుకోకుండా చెల్లిని అనరానిమాట లన్నాను. ఆపాప పరిహారంకోసం నే నెంతటిత్యాగానికైనా వెనుదీయదలచలేదు. నాకు మార్గదర్శకురాలు మన గుణ, బాబా!

ధర్మ : (ఆనందంతో కూడిన స్వరంతో ప్రసాద్ దగ్గరకు వచ్చి చేతులు పట్టుకుంటూ) బాబూ!

ప్రసా : బాబా! (చేతులు పట్టుకుంటాడు.)

గుణ : (ప్రక్కకు చూసి) వేణూ వస్తున్నా డన్నయ్యా!

ప్రసా : మీరు విశ్రాంతి తీసుకోండి, బాబా! నేనూ వేణూ వెళ్ళి మధుని విడిపించి తీసుకొస్తాం.

ధర్మ : అలాగే బాబూ! (వెళ్తాడు)

(వేణు వస్తాడు)

ప్రసా : ఎక్కడి కెళ్ళావురా?

వేణు : ఎక్కడికీ లేదు.

గుణ : అయితే యిక్కడే వున్నావా?

వేణు : ఆఁ, యిప్పు డిక్కడే వున్నాను.

గుణ : (నవ్వుతూ) బాగుంది సమాధానం.

వేణు : మీ ప్రశ్నలకంటేనా?

ప్రసా : అఘోరించావుగాని, అసలు యెక్కడి కెళ్ళావో చెప్పు వోయ్!

వేణు : ఎప్పుడు?

గుణ : యిక్కడికి రాకముందు.

వేణు : అదా? ప్రసాద్ యింటికి. నో, నో! నారాయణబాబు గారింటికి.

ప్రసా : ఎందుకు ?

వేణు : ఊరికే చూసివద్దామని.

ప్రసా : ఏమంటున్నారు ...

వేణు : ఎవరికి తోచినట్టు, వా రంటున్నారు.

ప్రసా : అంటే?

వేణు : అంటే గింటే–అవన్నీ తర్వాత మాట్లాడదాంగాని ఆ మూర్తిగాడి మిడిసిపాటుచూస్తే అరికాలిమంట నడినెత్తి కెక్కుతోందిరా నాకు.

ప్రసా : ఏం కూశాడేం?

వేణు : తనొక ఏమీఎరగని పెద్దమనిషిలా పోజుపెట్టి యిష్టం వచ్చినట్టు కూశాడు. యిక మీమామగారు కూడా యేదో అన్నార్లే.

గుణ : ఇంతకూ వదిన ఏమంది?

ప్రసా : అది వేరే అడగాలా గుణా! ఆ తండ్రికూతు రేకదూ? ఆయన్ని కాదంటుందా?

గుణ : ఎందుకాకూడదూ? వదిన తప్పకుండా వాళ్ళ నాన్నను వ్యతిరేకిస్తుంది. ఎప్పుడో ఒకప్పుడు వదిన నిన్ను కలుసుకోకపోదు. అప్పుడు చెబుతాను, మీయిద్దరిపనీ!

ప్రసా : ఏం చేస్తావ్?

గుణ : ఏం చేస్తానా? మీయిద్దరిచేతులూ పట్టుకొని యెప్పటికీ విడిపోకుండా నాచేతుల్తో కట్టిపారేస్తాను.

ప్రసా : ఎంత అమాయకురాలివి చెల్లీ! కోరి కష్టాలు తెచ్చిపెట్టు కోడాని కామె సాహసిస్తుందా?

గుణ : తప్పకుండా సాహసిస్తుంది.

వేణు ; భవిష్యత్తును గురించి జోస్యంచెబుతున్నావే!

గుణ ; అవును, నాకు తెలుసు. జరిగేదంతే!

వేణు : నిజంగా అలాగే జరిగిందంటే చైర్మనుగారిఆట కట్టిమని కడుతుంది.

ప్రసా : ఈ మాటల కేంగాని టైమయిపోయింది. పద కోర్టుకు, మధుని విడిపించి తీసుకొద్దాం.

గుణ : భోజనం చెయ్యకుండానే!

ప్రసా : భోజనాని కేంలేమ్మా! మధువచ్చిన తర్వాత అంతా కలిసి ఒకేసారి చేద్దాం. పదరా. (వెళ్తారు.)

(గుణ అన్నయ్యవస్తాడనే ఆనందంతో పాడుతుంటుంది.)

(పాట)

వస్తాడూ...వస్తాడూ
అన్న య్యేమో వస్తాడూ
జైలులోనుండి వస్తాడు
నాన్నకు మందులు తెస్తాడూ
మా కుటుంబమును పోషిస్తాడూ
చీటికిమాటికి చిరబురలాడుతు
కొడతానని బెదిరిస్తాడూ
కోపంతో నే కూర్చుంటే
వెనుక చేరి నవ్విస్తాడు

(బాబు వస్తాడు. బాబును చూచి గుణ పాట ఆపు చేస్తుంది.)

గుణ : ఎవరండీ మీరు?

నారా : (మాట్లాడడు. గుడ్లెర్రజేసి చూస్తాడు.)

గుణ : (భయపడి లోపలికి వెళ్తుంది. ధర్మయ్య మెల్లగా వస్తాడు.)

ధర్మ : ఎవరు? (బాబును చూచి ఆశ్చర్యంగా) మీరా !

నారా : (గంభీరంగా) ఊఁ, నేనే.

ధర్మ : కూర్చోండి బాబు! (కుర్చీ లాగుతాడు.)

నారా : (కూర్చోడు. కోపంతో కళ్లెర్రజేసి చూస్తాడు.)

ధర్మ : అబ్బాయిగారిప్పుడే అలా వెళ్ళారు, పిలవమంటారా?

నారా : అక్కర లేదు,

ధర్మ : అయితే తమ రెందుకు దయచేశారో సెలవిస్తారా?

నారా : నీకొడుకును విడిపించడానికా ప్రసాద్ వెళ్లిందీ?

ధర్మ : అవును, బాబూ! అందుకే వెళ్ళారు.

నారా : అకస్మాత్తుగా వాడికి మీమీద యింత అనుగ్రహం కలగడానికి కారణం?

ధర్మ : అది మా కెలా తెలుస్తుంది? ఆయనజాలిగుండె కారణం కావచ్చు.

నారా : (వికటంగా) జాలిగుండె!

ధర్మ : లోకంలో అంతా రాతిగుండెకలవాళ్లే వుండరు, బాబూ! జాలిగుండె కలవాళ్ళుకూడా వుంటారు.

నారా : అయితే పిడికెండలో వస్తుందోక్కవచ్చని ఆశ పడుతున్నావుకదూ?

ధర్మ : లేదు, బాబూ! లేదు. మిమ్మల్నెదుర్కొని మీతో విరోధం పెట్టుకోవాలని నాకు లేదు. నా కొడుకు వృద్దేకంతో మీ యింట్లో ఖాతాపుస్తకాలకు వచ్చిన నేరానికి మీ కాళ్ళుపట్టుకొని క్షమించమంటాను. న్యాయంగా మీకు రావల్సినబాకీ తీసుకొని నాకొంప నిలుపమని యిప్పటికీ ప్రార్థిస్తాను.

నారా : చాలించు, నీ నక్కవినయాలు!

ధర్మ : నక్కవినయాలు కాదు, బాబూ! నేను చెప్పేది న్యాయం.

నారా : కట్టిపెట్టు, నీ న్యాయశాస్త్రం.

ధర్మ : యింకా మీ రలాగే మాట్లాడితే నేను చెప్పే దేముంది?

నారా : నీచెప్పడం కట్టిపెట్టి, నేను చెప్పేది విను.

ధర్మ : ఏమి టది, బాబూ?

నారా : ఒకేఒకమాట చెబుతాను. దాన్ని నువ్వు తప్పకుండా ఆలోచించకుండా ఆచరించాలి. అలాచేస్తేనే బ్రతుకుతావ్. లేదా యిప్పుడే నాచేతిలో నాశనమైపోతావ్. ఏమంటావ్?

ధర్మ : ఆసంగతేదో తెలిసేవరకూ ఏమీ చెప్పలేను బాబు!

నారా : అయితే చెబుతున్నా విను. నువ్వు నీకూతుర్ని తీసుకొని యిప్పుడే యీక్షణమే యిక్కడనుంచి పోవాలి.

ధర్మ : (ఆశ్చర్యంగా) వెళ్ళిపోవాలా?

నారా : అవును. వెళ్ళిపోవాలి. తక్షణమే వెళ్ళిపోవాలి. యిది నా నిర్ణయం.

ధర్మ : కారణం?

నారా : నీకు తెలియదూ?

ధర్మ : నా కేం తెలుసు?

నారా : సిగ్గులేక నానోట్తోనే చెప్పించా లని చూస్తు న్నావా? నీచుడా! కొంపనిలుపుకోడాని కింతకన్నా గతి లేదని మానాభిమానాలుకూడా విడిచిపెట్టి, ప్రపంచం యేమంటుందో నసే భావమే లేకుండా నీచునిలా కన్న కూతుర్ని తార్చి—

ధర్మ : (ఉద్రేకంతో బిగ్గరగా) ఆపండి! అంతవర కాపండి. మీ నీచసంభాషణ అంతటితో కట్టిపెట్టండి! నేను మా నాభిమానాలు మంటగలపలేదు. మా పేదలోకం యె ప్పుడూ యింతగతిమాలినపని చెయ్యలేదు. డబ్బు కోసం నీతిని అమ్ముకోలేదు. అధికారంకోసం అడ్డమైన వార్లూ తొక్కడంలేదు. అవన్నీ చేసేది.మీరు. అన్యా యాని కొడిగట్టేది మీరు. నీతిని గోతిలోపెట్టేది మీరు. యిందుకా యిక్కడనుంచి నేను వెళ్ళాల్సింది. వెళ్ళను. ఖచ్చితంగా వెళ్ళను ముందు నువ్విక్కడనుంచి వెళ్ళు. తక్షణం వెళ్ళు. లేదా మెడమీద కర్రవేసిగెంటుతా –

నారా : (వెళ్ళిన చంపపై కొడతాడు.)

ధర్మ : (ఒళ్లుమరచిన ఆవేశంతో) కొట్టావురా? నీచుడా! నిన్ను నాశనంచేస్తాను. భూమిమీద నీ నీడలేకుండా చేస్తాను. నీరక్తాన్ని చిందిస్తాను ధనమదాంధులకళ్లు తెరిపిస్తాను. (అంటూ మీదికి వెళ్ళి గొంతుపుచ్చుకొం టాడు. యిద్దరూ పెనగులాడతారు. చివరకు విడిపించు కొని ధర్మయ్యను ఒక్కతోపుతోస్తాడు బాబు, ధర్మయ్య

వెనక్కి తూలిపోతాడు. వెంటనే కర్రతీసుకుని బాబు పైకి యెత్తుతాడు. బాబు పిస్టలుతీసి కాలుస్తాడు.)

ధర్మ : హా! (అంటూ పడిపోతాడు. ధ్వని విని గుణ బయటకు వస్తుంది. తండ్రిని చూచి 'నాన్నా' అని విూదపడుతుంది. నారాయణబాబు కంగారుగా అటూయిటూ చూస్తుంటాడు. కాని గుణను చూసేసరికి అతని కళ్ళ వెంట నిప్పులురాలుతున్నట్టు వుంటుంది.)

గుణ : (తండ్రిమీాద పడి యేడుస్తూ) నాన్నా! నాన్నా! మాట్లాడవేం నాన్నా? ఒక్కసారి యిటు చూడు నాన్నా! నాన్నా, నాన్నా! (బిగ్గరగా యేడుస్తుంటుంది, బాబు కంగారుగా అటూయిటూ చూసి వెళ్ళిపోతాడు.)

గుణ : (చరాల్న లేచి బాబుకు అడ్డంగా వచ్చి) ఆగు! దుర్మార్గుడా! యిప్పటికైనా నీ రక్తదాహం తీరిందా? మానవరుధిరోపాసక దానవహృదయం యిప్పటికైనా చల్లారిందా? పాషాణహృదయుడా! పగబట్టినతాచులా మాసంసారాన్ని బయటికీడ్చి బాధలుపెట్టేది చాలక పరమసాధువర్తనుడైన నా తండ్రిప్రాణాల్నికూడా బలిగొన్నావా? మమ్మల్ని అధోగతిపాలుచేశావా? యిదేనా ధర్మం... యింతేనా లోకం... దీనిపేరేనా న్యాయం! (దుఃఖంతో కూడిన ఆవేశంతో) అవును, యిదే నేటిన్యాయం...! నిరుపేద అమాయకజీవితాల్ని అంతంచెయ్యడమే నేటి న్యాయం! ధనమదాంధుల దౌష్ట్యాలకు తలఒగ్గడమే నేటిన్యాయం! నీలాంటి నీచాతినీచులకు నీరాజనంపట్టేదే నేటి న్యాయం—

నారా: (క్రోధంతో) ఆఁ కులటా! (కాలుస్తాడు. గుణ "హా" అంటూ పడిపోతుంది. బాబు పారిపోతాడు. యింతలో "చెల్లీ" అంటూ ప్రసాద్, "గుణా" అంటూ మధు వస్తారు. ప్రసాద్ గుణను పట్టుకుంటాడు. మధు తండ్రిని చూసి "నాన్నా" అంటూ ధర్మయ్యమీద పడతాడు. వెనుక వేణువస్తాడు.)

ప్రసా: వేణూ వెళ్లు, త్వరగా వెళ్ళు. స్టేషనుకు వెళ్ళు. ఆ దుర్మార్గుడ్ని పట్టుకో.

మధు: (వేణు చరచరా వెళ్తాడు.)

మధు: [ఏడుస్తూ] నాన్నా! మమ్మల్ని వంటరిగావదలి వెళ్ళిపోయావా! నాన్నా! న్యాయంకోసం చివరకు నీ ప్రాణాల్నికూడా బలిపెట్టావా!... ...అవును, పేదవాళ్ళకు నిలువనీడలేని యీపాడు ప్రపంచంలో బ్రతకడంకన్న చావడమే మేలు. (రక్తం చేతులకు పులుముకొని పూసుకుంటూ) రక్తం! మానవరక్తం! అంతులేని అమాయక నిరుపేదల అంతులేని వేడిరక్తం. ఆకలి ప్రేగులహారాల్తో, ఎముకలప్రోగుల ఆభరణాల్తో కలియుగరాక్షసులు కరాళనృత్యం చేస్తున్నారు.

ప్రసాద్ గుణకు మందులు వేస్తుంటాడు. గాయానికి కట్టు కడతాడు. గుణ స్పృహలేనిస్థితిలో వుండి యేదో గొణుగుతుంది.

గుణ: (స్పృహలేనిస్థితిలో) నాన్నా, నాన్నా! మాట్లాడ వేం నాన్నా!

మధు : (గుణమీద పడి యేడుస్తూ) గుణా! యిటుచూడమ్మా నేను మీఅన్నయ్యను. మధుని; ఒక్కసారి యిటు చూడు గుణా!

గుణ : (అచేతస్థితిలో] వద్దు. కాల్చవద్దు. మానాన్నను కాల్చ వద్దు. బాబూ! నారాయణ బాబూ!

మధు : (ఆవేశంతో చరాల్న లేస్తాడు.) నారాయణబాబు కాదు. నరరూప రాక్షసుడు. దీనికి తగిన ప్రతీకారం యిప్పుడే అనుభవిస్తాడు.

(స్వరని వెళ్తుంటాడు. వెనుక ప్రసాద్ "మధూ, మధూ" అని వెళ్ళబోతాడు. కాని మధు వినిపించుకోకుండా వెళ్ళిపోతాడు. గుణ "అన్నయ్యా" అంటుంది.)

ప్రసా : (ఆగి గుణదగ్గరకు వచ్చి, ఏమిటమ్మా?

"ప్రసాద్" అంటూ లీల, "బాబూ" అంటూ కోటాయ్ వస్తారు. ప్రసాద్ లీలను చూసి పెడమొఖంపెడతాడు. గుణ మెల్లగా కళ్ళు తెరచి వాళ్లను చూస్తుంది.)

గుణ : (లీలను చూస్తూ) ఎవ రన్నయ్యా!

ప్రసా : (మాట్లాడడు)

గుణ : (వదినా!)

ప్రసా : కాదమ్మా కాదు. మీరక్తాన్ని యీవిధంగా ప్రవ హింపజేసి చివరకు మీప్రాణాల్నిసహితం బలిగొనే ఆ నరహంతకుడైన నారాయణబాబుకు యీలీలాదేవి కుమార్తె.

లీల : ప్రసాద్! (కళ్ళనీళ్ళు పెట్టుకుంటుంది.)

కోటా : ఆ అమ్మ నింకా యేడిపించకండి, బాబూ! యిప్ప టికే ఆఅమ్మ కుమిలిపోతావుంది. ఆ దొంగకాతా బొక్కులు బయటికి లాగడంకోసం ఆ అమ్మ యెంత అవస్తపడిందో నాకు తెలుసు.

ప్రసా : ఖాతాపుస్తకాలా? (లీలచేతిలోవి లాక్కుంటూ) వీటి కోసమే దొంగతనంచేసి మధు జైలుకు వెళ్లింది. వీటికో సమే నేను పరితపించేది. కాని జరగవలసిన కఠోర కార్యం జరిగిపోయింది.

లీల : అవును, ప్రసాద్! యిప్పటివరకూ నాతండ్రిచేస్తున్న దుర్మార్గాల్ని తెలుసుకోలేక పోయాను. యిప్పుడే ఖాతాలుచూచాక నిజం గ్రహించాను. ఎన్నిసంసారాలు యీాయన మూలంగా నాశనమైనాయో యిప్పుడు గ్రహించాను. అందుకే ఆయన్ని వ్యతిరేకించదలచాను. అంతేకాదు, చివరకు నాతండ్రికి వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పడానికూడా వెనుకాడను.

గుణ : వదినా...!

లీల : (గుణ దగ్గరకు వచ్చి) వదినా! చెప్పుడుమాటలువిని నిన్ను నిష్కారణంగా అనుమానించాను. నన్ను క్షమించు వదినా!

గుణ : జరిగిందానికి విచారించకు. వదినా! (ప్రసాద్‌ను చూచి) అన్నయ్యా...! చివరిసారి నాదొకకోర్కె!

ప్రసా : ఏమిటది? చెప్పు చెల్లీ! చివరికి నాప్రాణమైనాసరే నీకోసం త్యాగంచేస్తాను. అ దేమిటో చెప్పు చెల్లీ!

గుణ : (లీలచేయిపట్టుకొని) అన్నయ్యా! (ప్రసాద్ చెయ్యి పట్టుకొని) మీరిద్దరూ ......!

ప్రసా : చెల్లీ-

గుణ : మాట్లాడ కన్నయ్యా ... చివరిసారి ... చెల్లికోర్కె-మన్నించు ... వదిన్ని పరిగ్రహించు. మీరిద్దరూ... ధనికులు చేసే యిలాంటి ఘోరహత్యల్ని ... అన్యాయాల్ని ... అంతంచెయ్యండి ... పేదవాళ్ళ కోసం పనిచెయ్యండి ... చివరిసారి నేను మీకుచెప్పేది ... యిదే .., లీలా ... ! ప్రసాద్! (కళ్ళుమూస్తుంది.)

ప్రసాద్ : చెల్లీ !
లీల : వదినా ! } (గుణమీద పడియేడుస్తారు)

(తెరలో) పాట

విన్నారా మీ రిక కన్నారా
ధనమదాంధుల దౌర్జన్యాలకు
ప్రాణాల్విడచిన పేదలగాథ
యిదేగా నేటి న్యాయం !
యిదేగా నేటి న్యాయం ! !

(కోటాయ్ శవాలమీద గుడ్డకప్పుతుంటాడు. మెల్లగా తెరజారుతుంది.)

సమాప్తం.

తొలిముద్రణ 1000 ప్రతులు 1953
ముద్రణ : శ్రీ సత్యనారాయణ ప్రింటింగు వర్క్సు, విజయవాడ.